# చెప్పలేం!

(అయిదు రంగాలుగల రూపకం)

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

ప్రథమ ముద్రణం
మే 1953-1000

## హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే, లేక సొమ్ము వసూలు చేసుకొనే నిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఏదైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘంవారున్నూ ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం కాపీ రైట్ చట్టప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరువాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

వెల
రూపాయి

# చెప్పలేం!

## రంగాల పేర్లు

1. అంతర్యాలు వేరు
2. పీడకల
3. అపనిందలు
4. ముసిలి ప్రియురాలు
5. తీరా చూస్తే...

## పాత్రలు

నవీన్ కుమార్—(చదివినవాడు)

కోదండం—(నౌఖరు)

మహాదేవి—(నవీన్ కుమార్ చెల్లెలు)

వరహాలు—(నవీన్ స్నేహితుడు)

మిస్ చకోరం—(ఆరితేరిన నటి)

సంకేతములు: (నటించేవారికి)

RF - కు. ఎ. - కుడిఎదర

RM - కు. మ. - కుడిమధ్య

RB - కు. వె. - కుడివెనక

LF - ఎ. ఎ. - ఎడమఎదర

LM - ఎ. మ. - ఎడమమధ్య

LB - ఎ. వె. - ఎడమవెనక

MF - మ. ఎ. - మధ్యఎదర

MM - మ. మ. - మధ్యమధ్య

MB - మ. వె. - మధ్యవెనక

# చెప్పతేం!

| పాత్ర : | వచ్చే రంగాలు |
| --- | --- |
| సరిత — | 1, 2, 3, 4, 5 |
| శ్రీ — | 1, 3, 4, 5 |
| ము — | 1, 2, 5 |
| వ — | 2, 3 |
| మి — | 4, 5 |

| రంగం : | | వచ్చే పాత్రలు |
| --- | --- | --- |
| 1. | — | ము, స, శ్రీ |
| 2. | — | ము, వ, స |
| 3. | — | వ, శ్రీ, స |
| 4. | — | వ, శ్రీ, మి |
| 5. | — | మి, స, శ్రీ, ము |

---

# చెప్పలేం!

## రంగం-1

[నవీన్‌కుమార్ బసలో హాలు. మహాదేవి చాపమీద కూచుని రాస్తూంటుంది. పక్కని పోతన్నగారి 'భాగవతం' ఉంటుంది.]

మహా—(తెర లేవగానే, రాయడం ఆపి, లేచి, ఏదో ఆలోచిస్తూన్నట్టు కనిపించి) ఔరా! నా మానువర్తి వ్యాజ్యం కోసం ఈ పట్నంవచ్చి వారం అయింది, నేనూ మా అన్నయ్యాను! ఇంకా గట్టి ప్లీడరే కుదర్లేదంటాడు మా అన్నయ్య! మా అన్నయ్య అసలు ఏ ప్లీడరింటికీకూడా వెళ్లడం లేదనిన్నీ ఎవర్తో నాటక 'తార' కోసం తిరుగుతున్నాడనిన్నీ అంటాడు, మా నౌఖరు కోదండం! అదెంత వరకు నిజమో. నేను రోజూ పురాణంలోకి వెడుతున్నానంటే నమ్మేస్తున్నాడు మా అన్నయ్య! నేను నా పరిచయులికి ఉత్తరాలు రాసుగునేటప్పుడు మా అన్నయ్య చూసి ఏమిటని నన్ను అడగ్గా రామకోటి రాస్తున్నానన్నాను. మహా దొడ్డపని చేస్తున్నావు—అని మా అన్నయ్య నన్ను మెచ్చుగున్నాడు. నా కాపరం అస్థాయిస్తం అయింది గనక, ఏదేనా నాటక సమాజంలో చేరేసెయ్యాలని నా

కుంది. ఆ సంగతే ఒకరికి రాశాను, వయినాలకోసం, ఈ ఉత్తరం పంపేదాకా ఎక్కడోకంటె ఈ 'భాగవతం' లో పెట్టేస్తేనే పవిత్రం. అన్నయ్య ధోరణి నాకు తెలిసిందిగాని, నా రహస్యం గ్రహించడం అన్నయ్య తరంకాదు. అన్నయ్య రాసేదేముటో సంభాషించి ఆరా తియ్యాలి. అన్నయ్యా! నవీనూ!

న—(కుడి మధ్యనించి వస్తూ) ఓయ్! ఏదేనా పద్యానికి అర్థం కావాలా?

మ—ఒహ్! నీకు తెలుగు రాదుగా అన్నయ్యా! అందులో ఇది భాగవతం. భాగవతం తెలిసి పలకడం కవే తనకి చేతగాదన్నాడు.

న—సరే. నాకు చేతాకాదు, వాతాకాదు, మరి ఎందుకు పిల్చావు? నువ్వు పురాణంలోకి వెళ్లేవేళ అయిందా?

మ—అబ్బో! ఇంకా చాలా వ్యవధి ఉందిలే!... నువ్వు ఏమన్నా రాసుకుంటున్నావా?

న—అబ్బే, రాతకేముందీ? మన రాత మామూలు రాతే! పనేముటో చెబుదూ!

మ—ఏం లేదూ! ఈ దిక్కుమాలి మనవర్తి వ్యాజ్యానికంటూ మనం ఇంకా ఈ ఊళ్లో ఎన్నాళ్లు ఇడవడం?

న—సరిపోయిందేవ్! ఇంకా ఓమూలు ఇల్లలకడమేనా కాలేదాయిరి, ఇంతట్లోకే చిర్రు బుర్రుమంటే,

ఎల్లా ఏడుస్తుందీ! మహోపతాపానికి తెమిత్తే ఇప్పుడు తెమిలి నట్టు.

మ—నీ బావగారు వచ్చినాడుకూడా సిద్ధం అయ్యాట్ట ఈ ఊరు. విన్నావా ?

న—ఎవరూ, మీ ఆయనే! అంతయ్య బావే!

మ—మరె! (అని, పెదిమివిరిచి తల తిప్పుగుంటూ) బావ! బోడిబావ దొరికా డెల్లాగతేం! ఉన్నట్టూకాదు, అయినకాడికి చచ్చు తెగేసి పోయినట్టూకాదు.

న—నేలేని సమయం కనిపెట్టి, ఈ బసలోకి వచ్చి పడ్డాడా ?

మ—మొహం చెల్లద్దూ పీనుక్కి! పేణ్ణేళ్ళుకొట్టనూ!

న—మరి నీకెల్లా తెలిసిందీ, ఆయ నొచ్చాడనీ!

మ—నే నెవర్నో తిన్నగా ఎరక్క ఒకావిడ నిన్న నాతో చెప్పింది ఈవార్త సినీమాలో......పల్నించి ఇవతలికి వస్తూనూ!

న—అయితే యిప్పుడు అతడితో రాజీలాంటిది పడతానంటావా ?

మ—వడిసినట్టే ఉంది నవీనూ! నన్ను అంతలేసి కూతలు కూసిన ఘటంతో మళ్ళీ నేను కాపరం చేస్తానా ? ఏమూలో పడుండి, నా నామస్మరణ నే చేసుగుంటే నా ఘటం వెళ్ళిపోదూ? వాడిజోలి నా కెందుకూ? అసలు వాడు వొట్టి మృగం, పశువు—పరమ మూర్ఖుడు. నేనే ఒకగోల

నైనప్పుడు ఆగోల నాకేలా! నా రామనామం నేను రాసుగుంటాను.

న—నిజమే, మహాదేవీ, నిజం. నాకు తోడబుట్టిన దానివి గనక నిన్ను మొహం ఎదట పొగడకూడదుగాని, నీ దీక్ష భూమ్మీద ఉందిటే!

మ—ఆ. పొగిడి పొగిడి నువ్వే పొగడాలి నన్ను! సేబాసు! లోకం గవ్వకిందేనా కట్టదు నీదీక్షా నాదీక్షాను!

న—నేను లోకంలో ఓభాగాన్ని కాదుటే వెర్రి దానా! నాకు తెలియదుటే నువ్వు ఎన్ని లక్షల రామ నామం రాసిన పుణ్యస్త్రీవో!

మ—నువ్వు రాసేది మాత్రం రామనామం కాదా యేం?

న—రామ రామ! నే రాసేది ఏదో మామూలు సరుకు.

మ—నీచం అయిందా?

న—అబ్బే! గొప్పదే.

మ—గొప్పరాత అంటే గొప్పపనుల్ని గురించి రాసిందా?

న—అవును.

మ—గొప్పపని అంటే గొప్పతనం గలవాళ్ళు చేసినపనా?

న—కాదు. గొప్పా కొద్దీ అనేవి ఎంతమాత్రం లేకుండా సర్వాన్నీ సమం చెయ్యడమే గొప్పపని. పైగా, ఎవణ్ణేనా ఒకణ్ణి గొప్పవాణ్ణిగా తయారు చేసేటందుకు తోడ్పడేదే గొప్పపని.

మ—గొప్పవాణ్ణి తయారు చేసేపని గొప్పదాన్ని కూడా తయారుచేస్తుంది అనుకోడం ధర్మం. నాకుకూడా వినిపించన్నయ్యా, నీ రచనా!

న—నే రాసేదంతా లోకంయొక్క మరమ్మతు కోసం తంటాలుపడే నా బోటివాళ్ళకి తప్ప తక్కిన నీ బోంట్లకి అనవసరం.

మ—ఇస్తాం అన్నపిల్లని అక్ఖర్లేదనడమూ, ఇవ్వం అన్న ఉద్యోగం కావాలనడమూ లాంటివా, లోకంయొక్క మరమ్మతంటే?

న—అబ్బో, ఆ ఘోషంతా వద్దు. నీపని చూసుకుందూ!

మ—సరే.

న—నువ్వు వెడతావు గావును, కోదండంగాణ్ణి పిలుస్తానుండు. (ఎడమ మధ్యకి తిరిగి ఈలేసి) కోదండం, ఓరి కోదండం! వెధవ నిద్దర ముప్పొద్దులా...కుంభకర్ణుడి మేనమామలాగ! వేళాపాళా అక్ఖర్లేదూ?

కో—(ఎడమ మధ్యనించి వస్తూ మూలిగి, కూచోబడి, ఆవలించి, దోమలు తోలుకోడానికి తప్పామనిపించి) సిత్తం!

న—మా చెల్లెలు పురాణానికి వెడుతుందిట చూసా!

కో—(జోగుతూ) చూడటానికి నాకు దూరం ఆన దండీ!

న—ఔరా చూడమంటే కళ్ళుమూసుగునే ఏడుస్తా వేమిరా!

కో—దగ్గిర్నించి సూత్తే ఏటినా అనుకుంటారండీ, మీ కేటి తెలుస్నా!

న—ఇవే నీదగ్గిరున్న పని శూన్యం కబుర్లు! పగటి కో రూపాయీ రాత్రికో రూపాయీ నీ మొదాన్ని పెడు తూన్నా, నీకు ఎఖిడా చీమ పాకినట్టైనా లేదే! ముందు నాకు దణ్ణం పెట్టు.

కో—సిత్తం.

న—చిత్త మేమిటి ప్రతీదానికీ?

కో—సిత్తం సిత్తం.

న—అదేమళ్ళీ రొండుమాట్లెందుకురా నీమొహానికి!

కో—(నవ్వుమొహంతో) సిత్తం అలవాటండి.

న—సరేగాని దణ్ణం ఏదీ?

కో—అది నా సేతుల్లో పనేగాని, యిప్పట్లో సత్తువ లేదండి. దేవుడు మేలుసేత్తే ముందుముందు.

న—ఇల్లాంటి సమర్థింపులు వద్దనే నీకు లక్షసార్లు గడ్డెట్టడమూ అయింది, నువ్వు అది యీావత్తూ నమిలెయ్యడమూ అయింది. ఏడిశావుగాని, లేచి నుంచో!

కో—నే నేదో కాస్త్రంత పడుకుంటే ఇంతేముప్పు మీకేంముకండీ! ఇదుగో నిలబడ్డానండీ! సూస్కోండి మేం నిలబడ్డామో లేదో!

న—మేంట! ఇద్దరు గావును వీడూ వీడి పొగరూ కలిసి! (మహాదేవితో) మహాదేవీ!

మ—ఆఁ

న—నేను ప్లీడరుగారికి కొంచెం బజానా ఇయ్యవలిసి వుంటుంది, ఓ పాతిక తీసి యిచ్చి వెళ్ళు.

మ—నువ్వే తీసుకో, ఇదిగో పెట్టె తాళంచెవులు! (అని తాళంచెవుల గుత్తి ఇస్తుంది).

న—(తాళంచెవుల గుత్తి పుచ్చుకుని) కోదండం! నువ్వు సాయం వెళ్ళి మహాదేవిని ఆ పురాణంచోట దిగబెట్టిరా, చీకటిగా ఉంటుందీ!

కో—ఎందుకండీ, దీపా లుండగా యండీ!

న—నోరుమూసుకుని చెప్పినట్టు చెయ్యి కొక్కురు మనకుండా!

కో—అసలు దీపాలుకూడా అక్కర్లేదు, అమ్మాయిగారే పెద్ద వెలుగు!

మ—(తన్ని పొగిడినందుకు కులుకుతూ) ఊరుకో, కోదండం! నీమాత్రం గ్రహింపు అన్నయ్యకి ఉండదా ఏమిటి? సాయం అక్కర్లే దన్నయ్యా! రెండు బారలు, చిటికెలో వెళ్ళొచ్చు.

న—సరే, జాగర్త.

మ—ఇదుగో పుస్తకం ఇక్కడుంది, వెడతాను.

(అని కుడి ఎదర్నించి వెడుతుంది).

న—(కుడి ఎదరకి వచ్చి చూస్తూ) అమ్మాయి వెళ్ళింది...అమ్మయ్య! కోదండం, మహాదేవి వెళ్ళిపోయి నట్టేనా?

కో—సాలా బాగం యెల్లిపోయారండి.

న—అదేమిట్రా? చాలాభాగం ఏమిటి నీ మొహం!

కో—అదాండీ! ఆ రెల్లిపోయినా, ఆ రెట్టుగున్న పువ్వుల సువాసన ఇక్కడే ఉందండి.

న—ఓరి నీయింట పటారంగానూ, అసాధ్యుడివే! బాగా తీశావే సారస్యం

కో—సమయం దొరికి నప్పుడల్లా నేను సారం లాగేత్తానండి.

న—సరే కూచో

కో—నేను కూచునే ఉన్నానండి.

న—ఒరేయ్!

కో—(ఉలిక్కిపడి) సిత్తం.

న—ఎన్నాళ్లైంది రా, మనం, ఈ ఊరొచ్చి?

కో—ఒకటి రెండు మూడు రోజు లైందండి.

న—ఛీ, అదేమి లెఖ్ఖరా, మతిలేని లెఖ్ఖా!

కో—(ఆవలించి చిటికెలు వేసి) ఇదోరకమండి, ఎల్లా సూసినా అంతే!

న—నేనెల్లాంటి వాణ్ణిరా ?

కో—సాలా మంచోరండి.

న—నిజంగా చెప్పు...మనస్సులో ఏముంటే అది.

కో—రా త్తెళ్లప్పుడు అప్పుడప్పుడు దెబ్బలుతింటే తిన్నారుగాని, మా సెడ్డ మంచోరండి, నన్నడిగితే !

న—అదుగో, వెనకటి సంగతులు వద్దన్నాను. నా పూర్వపు సంగతులు ఎత్తావంటే పాతేస్తాను. నాకు కోపం వస్తే ఏముటో తెలుసా ?

కో—తెలుసునండి.

న—ఏమిటి తెల్సు ? ఏమిటి తెలుసురా ?

కో—మీకు కోపం వత్తే జుట్టులేదు పీక్కోడానికి ! మీంపళ్ళు పీక్కుంటారు. మడిసి మొదట యిచ్చకాలాడతారు. మడిసి యెల్లగానే ఆడిమీంద కారుకూతలు కూత్తారు. తక్కువో ళ్ళున్నప్పుడు మెంతిగింజలాగ ఎగిరిపడతారు.

న—ఒకేయ్ ! మాటలు తిన్నగారావ్ ! నీలాంటి ద్విపాదుడి అభిప్రాయం కాదు నేనడిగేది. జనం నన్ను గురించి ఏమనుకుంటున్నారని.

కో—జనం అంటే వోళ్ళూ ? కొందరు మిమ్మల్ని దవ్వా అనుకుంటున్నారు.

న—అదుగో పొగరు. ఊళ్ళో మంచిజనం మాట నేనడిగేది !

కో—ఏమో! ఎవరు మంచోడో! ఓట్లు నేనడగ లేదు, ఓడూ నాతో చెప్పలేదు. మీకు డబ్బుందిగా! లంచా లిచ్చి గొప్పోరని పిలిపించుగోండి. మొట్టేవోడికి సప్లయిలు చేసి మచ్చిక చేసుగోడం మీకు తెల్సుగా!

న—అప్పనుగదా, ఒరే, గొప్పతనం ఎల్లా వస్తుం దిరా?

కో—ఒక్కొక్కపాలి యేదేనా యెదవపని సేత్తే గాని గొప్పతనం రాదండి.

న—రైట్, రా, రాస్కెల్, రైట్. ఏదో అన్యా యం లేందే ఏవిధమైన గొప్పతనమూ కలగనే కలగదు. అందుకని, గొప్పతనం అనేదాన్ని నాశనం చెయ్యడానికి ఏంజేసినా అన్యాయంకాదు. గొప్పతనాన్ని కొట్టి పారెయ్య డం నావంటివాడి కర్తవ్యం.

కో—సిత్తం.

న—అప్పుడు గొప్ప కొద్దీ లీనం అయిపోయి సమ త్వం ఏర్పడాలి. అంతా సమం కావాలి.

కో—సిత్తం. మీరూ నేనూనా?

న—ఛీ. ఇది నీ నామాటకాదు. సమం కావలిసింది నాకంటె గొప్పవాళ్ళూ నేనూనూ! గొప్పవాళ్ళని కాళ్ళ బేరానికి తీసుగురావాలి. అల్లా తీసుగురావడం ఎల్లానో తెలుసా?

కో—(నిర్లక్ష్యంగా) గట్టిగా బడితెబాజా చెయ్యడం మొదలెట్టి.

న—అదే నీకు తెలిసిన బోడిముత్తాయింపు. కాని, ఆ విధం చాలా మోటు.

కో—లేకపోతే ఆళ్ళని మించిన పెత్తనం, పెగ్గె, పేరూ, పైసా, పౌర్సం ఉండాలి.

న—అల్లాంటివి ఏవీ ఎంతమాత్రం అవసరం లేకుండా, ఎల్లా చెప్పుగో!

కో—(ఉసూరుమంటూ) నాకేటి తెల స్తదీ! తమరు సెప్పాలి.

న—ఒక అస్త్రం ప్రయోగించడంవల్ల.

కో—అత్రమా?

న—అవును.

కో—అయితే బాబూ! ఆ అత్రం సేతదా పోతదా? ఏటిటితో సేసిందీ?

న—అస్త్రంఅంటే కేవలం గాలి తరంగం.

కో—నాకు సూపలేదే తమ రెప్పుడూ!

న—అది కంట పడదు.

కో—ఏటో! కంటపడని దినుసుకి ఒంటపడడం ఎందు కన్నాను! కంటపడే కర్రతిరగేసి అయినకాడికి నాకదమే పెసెస్తమండి.

న—అవునులే. నువ్ చెప్పేది పూర్వపు పద్ధతి. నే చెప్పేది సరికొత్తది.

కో—సరికొత్త దంటే పాతతుక్కు కంటె నాసిరకం అన్నమాటండి.

న—అబ్బ ముందు విందూ! ఈ అస్త్రంపేరు స్త్రీ పురుష రహస్యం బంధాపవాదం!

కో—(వెనక్కి ఓ అడుగేసి) అమ్మబాబో! అంతెంత మాటల్తో నాకు వొళ్ళు తిరిగిపోయి దాహం యేసేస్తాంది. అది నాకు సయించ దండీ.

న—అనగా, పేరుగల ఒక పురుషుడికిన్నీ ఒక స్త్రీకిన్నీ......

కో—తప్పులు కట్టడమా? సీ! దానికంటె మరో 'జాం' యెంటనే యేస్కోడం మంచిదండి, నన్నడిగితే!

న—ఛీ నోరుముయ్! ఇది చాలా తేలిక. ఇందులో ప్రత్యక్ష సాక్ష్యం అవసరం లేదుగనక, దీనికి తిరుగుండదు. పండిత పామర జనంలో ఈ మంత్రం పట్టిచ్చినట్టు మరోటి పట్టివ్వదు.

కో—ఏటో! ఇలాంటి పనికంటె దొంగతనంకుడా నయంఅండి, నా ఊహ.

న—ఓరి నీ ఊహంమండా! దొరికి దొరికి ఎంత కరాకండీ లాంటి కొయ్యవి దొరికావురా నాఅంత తెలివి గలవాడికి! బొత్తిగా వినిపించుగోవేం కూడానూ! ఒక్కొక్కడి జాతకాన్నిబట్టి, నీలాంటివాడు పోగొడతాడు.

కో—తమరు తిడితే తిట్టండిగాని, మీరు సెప్పే దాంటో నాకు నమ్మకం సీమంతేనా లేదండి. అలాంటి పెసంగాలు మన కెందుకన్నాను! మనం సెప్పోళ్ళంకాంగా!

న—ఓరి వెఱ్ఱిపీనుగా ! ఇలాంటి సంగతులేనా అంతా నమ్మేదీ ! కాదు కాదు. ఇలాంటి సంగతులు తప్ప కడంవి నమ్మనే నమ్మరు కుడానూ ! నీకేం తెలుసు నీ మొహం ! నీదగ్గిర నాజూకుతనం అనేది ఆర్చుకుపోయి శూన్యం అయిందిగాని, లేకపోతే నువ్వూ బ్రహ్మానందపడీ, ఇలాంటి వార్తలు ఎప్పుడు వస్తాయా, ఎప్పుడు నమ్మేద్దామా అని సిద్ధంగా కూచుని ఉండేవాడవు.

కో—(చప్పరించి) రేవెట్టి ఉతగడం మంచిదండీ !

న—నీ మొహం, విందూ ? ఏం జెయ్యాలంటే, మనమే మొదట్లో వెళ్ళి నమ్మేబాపతు వాళ్ళదగ్గిర, 'ఊరంతా కోశ్రై కుంస్తున్నారేమిటీ,' 'ఎవళ్ళ నోట్లో చూసినా ఇదేమాట' అంటూ యథాలాభంగా ఇల్లాంటి వార్తకి జననం జరిగే తంటాలుపడాలి. అక్కణ్ణించి జనం అంతా ఇదుగో పులి అంటే అదుగో తోక అనీ, దున్నపోతు ఈనిందంటే దూణ్ణి కట్టెయ్యండి అనీ అంటూ సాయం చేసిపెడతారు.

కో—మీారు సెప్పేది, ఒక్కముక్కైనా నాకు రుచిగా లేదండీ. (అని ఆవలిస్తాడు.)

న—అబ్బ ! తిన్నగావిను. ఆ తరవాత ఒక్కొక్క జనుడు మొదలెడతాడోరీ, ఏంచెప్పను !

(తన సంగతిలాగ)—నేను ఇంతా జరుగుతుందని మొదణ్ణించీ ఊహించాను !

(తనమాట వేదంలాగ)—నేను ఈ సంగతి వెనకే చెప్పాను!

(బుజువు దొరికినట్టు)—అల్లా చెప్పుమరీ!

(తనమాట నమ్మక చెడ్డట్టు)—ఇల్లాయిల్లా జరుగుతుంది స్మండి, అని నేను అప్పుడే అంటోచ్చేవాణ్ణి. విన్నవాళ్ళు పోస్ పొమ్మంటోచ్చేవారు. ఇప్పుడు ఏమైంది?

(అనుమానం తీరినట్టు)—పెళ్ళి వాలకం ఏమిరా అనుకునేవాణ్ణి. ఇదుగో ఇప్పటి శుభవార్తతో సంగతులన్నీ బోధపడుతున్నాయి, నాకు.

(సాయం కోరుతూన్నట్టు)—నీ కడుపు చల్లగా, అంతమాటా అన్నావ్! తథాస్తు. నేను నోరు చేసుగోడం ఎందుకూ, నీనోటే అనిపిద్దాం అని ఊరుకున్నాను!

(తనబాధ తొలిగినట్టు)—ఇప్పటికి నా మనస్సు కుదటపడింది, ఏమనుకున్నారోగాని!

(తనజోశ్యం నెగ్గినట్టు)—అక్షరాలా ఇల్లా అవుతుందని నడివీధులో చచ్చు తెగేసి య్యాభై మంది యెదట పట్టపగలు నేను అదినే చెప్పేశాను!

(అనుమానిస్తూన్నట్టు)—ఇల్లా యిల్లా విన్నాం. పాపపుణ్యాలు పరమాత్ముడికి తెలియాలి. ఎరిగీ ఎరగని మాటలు చెప్పాగుంటే అన్నం సెయిహ్యా పుట్టవ్ కుడాసూ!

(నిస్పృహా నటిస్తూన్నట్టు)—వా. రిద్దరికీ స్నేహంట్ట, ఏడో! అయినాగానీ మనకెందుకు దిక్కుమాలి పాడు

మాటలూ, ఏ కర్రని నిప్పంటితే ఆ కర్రే కాల్తుంది. శెలి యని గొడవలు చెప్పగుంటే పుట్టగతులుండవ్. పైగా మూస్తూన్న పాట్న కళ్ళు రెండూ బొత్తలడి ఊరుకుంటాయి. కాని, బోలెడుమంది ఇవే గుసగుసలు!

(క్షమిస్తూన్నట్టు)—లెఖ్ఖేమిటండీ? మహామహా విశ్వామిత్రుడూ వ్యాసుడూ లాంటివాళ్ళకే టికాణా లేకపోయిందాయిటీ, చంచలం హి మనః, ఎవడు ప్రూచీ పడగలడూ, చెప్పలేం!

కో—(పై వాక్యాలు అయేటప్పుడు, తనకి వచ్చి పడుతూన్న నిద్రగురించిన శబ్దాలుచేస్తూ ఆవలింత, చిటిగి, వొళ్ళు విరుచుగోడం, పెదిమిల్లోంచి గాలి వొదలడం, కొలక మూరడం మొదలైనవి అయి గుర్రులో పడాలి.)

న—ఒరేయ్, నువ్వు గుర్రడం మాని వింటావా, ఏమన్నా కావాలా వాయింపు?

కో—(ఉలిక్కిపడి) ఛఛా. నాకేం కర్మం అండీ, నాకు ఆలాటివి మొదణ్ణించీ కిట్టవని చెప్పలేదండీ!

న—అయితే విను. అపవాద ప్రచారంలో జనం ఎందుకు పాల్గొంటా రంటే, జనానికి రెండు వెర్రినమ్మకాలున్నాయి.

కో—అవునండి.

న—ఏమిటవి?

కో—అవేనా! మీరు సెబుతారుగా!

న——అల్లాంటి జవాబులే నిన్ను చెప్పనద్దన్నాను. మొదటిది, అన్యుల లోట్లు సన్నసన్నగా ప్రచారం చెయ్యడంలో తమరియొక్క ఔన్నత్యం స్థిరపడుతుందిగదా, అని. రెండోది, ఒకవేళ తమరికికూడా అటువంటి లోట్లు ఉన్నా, వాటిని తమరు కప్పెట్టుగో గలిగినంత జాగర్తగా అవతల వాళ్ళు కప్పెట్టుగోలేక పోవడంలో కనపరిచిన అజ్ఞానం మీాద తమరి జ్ఞాన పతాకం ఎగురుతూ ఉండకపోతుందా, అని! ఇవి రెండూ నీకు బాగా బోధపడ్డాయో లేదో, మళ్ళీ చెబుతాను.

కో——(అథాత్తుగా ఏడుపువచ్చినట్టు) వద్దండి, వద్దండి. ఇవి రెండూ కలిసి సాలా గొడవలోకి దిగుతున్నాయి. నాబుర్ర సెడిపోయిందండి. కడుపులో నాకు ఒద్దే కంగారూ బెజారూగా ఉందండి. అన్యాయంగా రొత్తుండారేమో సూసిరానా?

న——ఓరి, నీమతి మండా! అప్పుడే ఎక్కడొస్తుందిరా? ఇప్పుడేగా వెళ్ళిందీ! విను. మిస్ చకోరం గురించి నేను ఇల్లానే పుకార్లు వేశాను. వేసినా, అది ఇంకా ఓకడకి రావటంలేదు. నన్నింకా మన్నించడం లేదు. ఆ మిస్ చకోరం......

కో——అదేం కోరం అండీ!

న——ఓరి దిక్కుమాలివాడా! కోరంకాదురా, మిళ్ళ కోరం! గొప్ప నటిరా, దేశదేశాలా పేరున్నదిరా, ఈ ఊళ్ళోనే ఉందిరా, పీథంట వెడుతూంటుందిరా...

కో—ఏమోనండి. వచ్చినాకు కావట్లేదు.

న—నీ మొహం లేస్తూ, నీ మొహామూని! ఆవిడొచ్చి నీకు కనపడాలీ! ఏడిసినట్టేఉంది, ఏడుపు! కాని, ఆవిణ్ణి గురించి ఇటీవల స్త్రీలు పిరాయించాను. ఆవిణ్ణి యాగీ చెయ్యడం మానేసి నేనూరుకోలేదు పొగడడం ప్రారంభించాను. అంతటితో ఆగలేదు. ఆవిణ్ణి నిరసించేవాళ్ళ మీద అమ్మశక్తిలాగ విరుచుకు పడుతున్నాను.

కో—విరుచుకు పడడం మీకు లెక్కేటి, విరుచుకు పడిపోతూంటారుగా!

న—ఇంతా చెప్పానా! ఇది నా అస్త్రంలో మొదటి భాగం!

కో—(విచారంగా) నాకిదంతా తెల్దండీ! నా తాత పర్యం సామిరంగా అని కళ్ళు మూసుగుని గిమ్మతిరగదొల్లాలండీ! కడమా అన్నిసముడు ఖర్చాండీ.

న—ఛీ విను.

కో—(కుసిల్సి్పిసా రాగా లెడతాడు)

న—అదేమంత్రా? ఏడుపుగుడా సాగించావే? ఏడపడం అనే పదార్థం నీకు తెలును నన్నమాట!

కో—జనంగురించి మీరాన్నమాట సత్తెప్పమా సంగా నిజం అండీ. నేను తాగుతానని జనం ఎక సెప్పుగుంటారుట. నాసామ్ము నేను తాగేసుకుంటే, ఈ నచ్చి

నోర్మూస్కి ఏడవడంఎందుకో సెప్పక ఊరుకుంటావేమయ్యాయ్!
(అని బావురు మంటాడు)

న—అహా! ఏడిచావులే, ఊరుకో. నేను పనిమీద వెళ్తున్నాను. నాకోసం నాస్నేహితుడు వరహాలనే ఒకబ్బాయి వస్తానన్నాడు. ఇక్కడ పెద్దచదువు చదువుతున్నాడులే. అతడుగనక వస్తే, నే వచ్చేదాకా అతణ్ణి ఇక్కడ ఆగమని చెప్పు.

కో—(ఏడుస్తూ) అందాకా నా ప్రాణం నిలుస్తేగా!

న—అదేం కర్మం!

కో—(దీనంగా) నేను సుక్క తగిత్తే ఉంటాను. లేకపోతే ఏటవుతుందో ఓడికి తెలుసూ! మా అమ్మకుడా ఊరెల్లింది. ఓ లమ్మా, నీకూ నాకూ మరి సూపు ఒుండాదో లేదోనే! (అని గొల్లుమని రాగాలు తీస్తాడు).

న—అదా! ఓరి నీ భయం కూలా! ఇదుగో, రూపాయి, పుచ్చుకో! (అని రూపాయి యిస్తూ) దాహం తాగు. రేపు సాయంత్రం నీ అవసరం ఉంది. తెలిసిందా? సుబ్బారాయుడు సరసరా పనిచెయ్యాలి.

కో—దండాలు దండాలు! సిత్తం! తమరి ఆజ్ఞ! తమరు ఏది సెయ్యమంటే అదే. ఏది మానమంటే అదే! సెలవ్!

న—నీకు మతి ఇప్పుడే పోతోందే! సెలవంటావేమిటీ ఉండమంటే! ఉండి, మహాదేవి రావడం తోటే,

నేను ప్లీడరుగారింటికి వెళ్ళానని, ఆవిడతో చెప్పు. వరహాలు రావడంతోటే నే వచ్చేదాకా ఉండమన్నానని అతడితో చెప్పు. ఉండు...లోపలికెళ్ళి లెఖ్ఖ తెచ్చుకుంటాను.

కో—నేను ఉండలేనండి.

న—ఏం?

కో—పీడరింటికా మీ రెల్లడం! కోరం కోసం రొండు కూనూ! సీ! యెందుకయ్యా అబద్ధం? యిల్లాంటి యజమానితో ఎల్లాగయ్యా! నే పోతాను.

న—నోరుముయ్. ఇక్కడుండు.

కో—పోసి మళ్లీ వత్తాలెండి. అబద్ధాలు మానండి. (అంటూ గబగబా కుడిఎదరనించి పరిగెట్టుకు పోతాడు.)

న—(కుడి ఎదర కేసి చూస్తూ, నిస్పృహగా) ఆరి, రాడీ! వెళ్ళిపోయాడు. వీడు తాగిందాకా మనిషి కాడు, తాగడంతోటే మనిషి కాడు. వీడు లేకపోతే నేను మనిషిని కాను. పడాలి, ఎంజెయ్యనూ? డబ్బు తీసుగుని, ఇంటికి తాళం పెట్టి వెడతాను. ఈసాటికి అసలు మహాదేవి వస్తూం టుంది. మహాదేవి దగ్గిర మారుతాళంచెవి ఉందిగా! (అని, ఎడమ మధ్యకి వెళ్ళి వెంటనేవచ్చి, కుడిమధ్య కేసి వెడుతూం డగా తెరపడుతుంది.)

---

## రంగం-2

[రెండో తెరఎదట. కుడి ఎదరనించి మహాదేవివస్తుంది]

మ—అబ్బబ్బ! కాళ్ళశని వొదిలింది. పురాణం ఆయనకి సుస్తీట, రాలేదు. సినీమాలోకి పోదాం అంటే టిక్కట్టు లేదన్నారు. (ఎడమ ఎదరకి నడిచి, పరకాయించి) అబ్బో! అప్పుడే యింటికి తాళం పెట్టి తుర్రుమన్నాడు, నవీను! ఏడి సినీమాతార ఎవరో కనుక్కోవాలి.

[ఎడమ ఎదరకి నిష్క్రమిస్తుంది. రెండో తెర లేవగా, వెనకటి దృశ్యమే.]

—(ఎడమ మధ్యనించి వస్తూ) కలికాలంలో తరించడానికి 'హరేరామ' తప్ప సాధనం లేదన్నారు. 'హరేరామ హరేరామ రామరామ హరేహరే, హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే' (అని అల్లా అంటూనే ఎడమ మధ్యకి వెడుతుంది.)

వరహాలు—(కుడి ఎదరనించి వస్తూ) నవీను బస ఎక్కడో! ఈ ప్రాంతం అనే అన్నాడు. ఎదర హాలుం దన్నాడు. ఎవరో హరేరామ పాడుతున్నారు. ఇక్కడే వాకబు చేద్దాం. (చాపమీద పుస్తకం చూసి) ఏమిటి చెప్మా, ఈ పుస్తకం? (తీసి) భాగవతం! బమ్మెర పోతన! పోతన్న తన శరీరంలో మకాం చేసినప్పటి కాలంలో ఎంత

దరిద్రం వెళ్ళబోసుకున్నాడో! ఈ గ్రంథంలో పోతన్న ఎంత ధన్యుడో! పోతన్నని హృద్గతం చేసుకునే ఉద్దేశంతో కొందరు విదేశీయులు తెలుగుభాష అభ్యసిస్తున్నారని వింటాం. ఒక్కొక్క పుటకి పోతన్నకి ఎంత ఇయ్యాలీ! (అని పుటలు తిరగేస్తాడు) ఏమి పుటలండీ! ఇదేమిటీ! ఇందులో ఏదో ఉత్తరం ఉందే! ఇతరులపుస్తకం అడక్కుండా ముట్టుగోడం బుద్ధి తక్కువ. అందులో ఉండే అచ్చు రచనే కాకుండా పై పచ్చు చేతిరాత కుడా సోదా చెయ్యడం మరీ నిఘాయకమైన మొండితనం. అయినా, యీ పుస్తకం భాగవతం గనక, ఇందులో మరోహ వ్యాపారం ఏమీ ఉండకూడదు, మరి. కొంచెం చూద్దాం.

"మిత్రరత్నమా"—ఓహోహో! ఇది భక్తి కానట్టుందే! "నిన్ను చూసింది ఒకసారేగాని, అదిచాలు. నీ జీవితమే జీవితం. నన్ను నీవర్గంలో వేసుగో, దయచేసి స్వీకరించు. నేను నీతో ఉంటూ ఏ వేషంబడితే ఆ వేషం వేస్తాను. చెప్పినపని, విని ఆచరిస్తాను. షరతులు రాయి, మా అన్న ఒక నాటకతారని మోహించుతున్నాడట. గ్రహించవలెను. ఇట్లు, మహాదేవి." సరి సరి. భయ భక్తులు రెండూ కుడా మృగ్యంలా ఉన్నాయే యీ స్థలంలో!—కొంపతవ్వి, ఈవిడే కాదుగదా, నవీన్‌కుమార్ చెల్లెలూ? చాలా తమాషా వ్యక్తిలా ఉందే! అయినా, సత్యం తెలియందీ ఏమీఅనుకోకూడదు, అధర్మం!

సత్యం తెలిసిన తరవాతా ఏమీ అనుకోకూడదు, అనవసరం... కాని, ప్రస్తుతం కొంచెం మూగ నటిస్తే మంచిది. (ఎడమ మధ్యకేసి చూస్తూ) ఇంట్లోంచి ఎవరో వస్తున్నారు. (ఎ ఏ ఏ అని కేకెయ్యబోయి, నాలిగి చప్పట్లు కొడతాడు)

మ—(ఎడమ మధ్యనించి వస్తుంది)

వ—(తెల్లబోయి చూస్తాడు).

మ—(కొంగు సర్దుకుని, తలవంచి, ఏదో వికారం చెందినట్టు చిన్న చిన్న నవ్వులు నవ్వుతుంది)

వ—(ముక్కు ఎత్తి, కళ్ళు సగం మూసి, ఓరచూపు చూస్తాడు)

మ—(చాపమీద కూచోమని సంజ్ఞ చేస్తుంది)

వ—(మూగాడులాగ, 'ఇది ఎవరిల్లు?' అని అడగబోతాడు)

మ—(తనూ మూగ నటిస్తూ 'ఇదిమాదే' అన్నట్టు తనకేసి చూపెట్టుగుని చిరునవ్వు ప్రయోగిస్తుంది)

వ—(నుంచునే ఉంటాడు)

మ—(కూచోమంటే అల్లా దిగాలుపడి చూస్తావేం అన్నట్టు అభినయిస్తుంది)

వ—(మూలుగుతూ, కోప్పడి, చెంపకాయ కొడతా నన్నట్టు నటిస్తాడు).

మ—(నన్ను కొడితే, నీ బుగ్గలు నలుపుతా నన్నట్టు, పళ్ళుబిగించి, చెబుతుంది)

వ—(ఊరికే అన్నానులెండి అన్నట్టు మూలిగి నవ్వేసి చెయి తిప్పుతాడు)

మ—(మళ్ళీ సంజ్ఞ చేసి కూచోమంటుంది)

వ—(మీసాల సంజ్ఞ చేసి, నీకంటె పెద్దవాళ్ళు మొగాళ్ళు ఎవరేనా ఇంటో ఉన్నారా అన్నట్టు చేతులు తిప్పి ఎత్తూ క్రాపింగూ చేతికర్ర పట్టుగుని నడనడపు తీవీ సూచిస్తాడు)

మ—(కుడి ఎడరికి నడుస్తూ, అటుచూసి, వరహాలుకి తెలియకుండా, వెళ్ళి వీధితలుపు వేసి చక్కానస్తా నన్నట్టు సూచించి, అటువెళ్ళి అప్పుడే వస్తుంది)

వ—(ఇది కనిపెట్టి, ఇంట్లో మొగాళ్ళున్నారా అని నే నడుగుతూంటే, వీధితలుపు గడియేసి రావడం ఎందుకూ అన్నట్టు కోప్పడతాడు).

మ—(కళ్ళుమూసి, నాలిక ఝూడించి, నవ్వి, చప్పరించి, ఎందుకో అందుకు పోదూ అన్నట్టు మొహంపెట్టి మీకు రాయడమూ చదవడమూ వచ్చునా అని సంజ్ఞ చేస్తుంది)

వ—(వెకిలినవ్వు నవ్వి, దణ్ణంపెట్టి, కళ్ళుమూసుగుని, ఆకాశంకేసి చూపిస్తూ, కొంచెం వచ్చు నన్నట్టు మొహం ముడిచి, చేత్తో సూచిస్తాడు)

మ—(మీరు నాకోసమేనా వచ్చింది—అనే సంగతి అతడికేసీ తనకేసీ వేలుచూపిస్తూ తలతిప్పుతూ కనుక్కుంటుంది.)

వ—(దుర్వాసన వేసేటప్పటికి మళ్లీ మొహం పెట్టి, నీకోసం కాదు అనే సంగతి ప్రకటించడానికి తలా చేతులూ తిప్పుతూ ఛుఛు అని ఉమ్మేస్తాడు.)

మ—(తర్జనితో బెదిరిస్తూ, గట్టిగా చెవులో) నా మాట వినకపోయావంటే, నీమూగ వొదిలిపోయేటట్టు తన్నిస్తాను జాగ్రత్త! నన్ను కంగారుపెట్టి అల్లరి చేశావని బొంకుతాను.

వ—(తనకి తిన్నగా వినపడదనీ, కాగితం ముక్కమీద రాసిమ్మనీ సంజ్ఞలు చేస్తాడు.)

మ—(పైమాటలు కాగితంమీద రాసియిస్తుంది.)

వ—(కాగితం జేబులో పెట్టుగుని, నమస్కరించి, సెలవు తీసుగుంటానని, అభినయిస్తాడు.)

మ—(కాగితంముక్క ఇచ్చేసి వెళ్ళాలిగాని, లేకపోతే బాగా జరగదు జాగ్రత్త అన్నట్టు సంజ్ఞ చేస్తుంది.)

వ—(కాగితంముక్క ఇచ్చేస్తూ) మరి నాకు సెలవా!

మ—(చాలా ఆశ్చర్యపడి, కొంచెం చిరకోపం తెచ్చుగుని) అమ్మో! ఇందాకణ్ణించీ, ఎంత దగా చేశారండీ, బలేవారే! ఇంతే నా మర్యాదా?

వ—మిమ్మల్ని చూసీచూడగానే నాకు మాట పోయింది, చావమన్నారా ఏమిటి?...అల్లా అనిపించాయి మీ ధోరణీ మీ అందమూ మీ అంతఃకరణామూ?

మ—ఊరుకోండీ, నాటకం కబుర్లూ మీరూనూ! ఆ మాటే నిజమైతే, పోయినమాట మళ్ళీ ఎల్లావచ్చిందో చెప్పండి.

వ—ఎల్లావచ్చిందా! కొంత రాతప్పాలం నాదగ్గిర చిక్కడ్డప్పుడు మీరు పడ్డ క్షోభ చూసేసరికి, నాకు **మాట** వచ్చేసింది.

మ—నమస్కారం. కాస్సేపు దయచేసి కూచోండి.

వ—అవశ్యం. సబబుగా మాట్లాడితే అడ్డమా! (అని కూచుంటాడు.)

మ—మీ పేరు ?

వ—వరహాలు.

మ—(పరీక్షగా చూస్తూ చిరునవ్వుతో) మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందే!

వ—(ఎగా దిగా చూస్తూ చిరికోపంతో) మిమ్మల్ని ఎక్కడా ఎన్నడూ చూడనట్టుందే!

మ—తమరు నన్నుగురించి పొరబడుతున్నా ల్లెండి.

వ—తమరు నన్నుగురించి పొరబడటం లేదులెండి. (అని నవ్వుతూ) అహోరించావుగాని, ఇక్కడ నవీనకుమార్ ఉన్నారా అమ్మాయి!

మ—(కోప్పడి నవ్వి తల ఊపుతూ) ఊఁ హు ఊఁ.

వ—నిన్న మాట్లాడ్డంలో ఈప్రాంతంలోనే బస చేశానని నవీనకుమార్ అన్నాడు లెండి.

మ—(తల ఝూడిస్తూ) ఊఁ ఊఁ ఊఁ

వ—అదుగో, మళ్ళీ మీరు మామూలు సంజ్ఞల జబ్బులో పడుతున్నారు. (కొంచెం నవ్వి) ఓహో! ఇక్కడే మకాం అనీన్నీ ప్రస్తుతం ఇంట్లో లేడనీన్నీ మీ ఉద్దేశం గావును. అల్లా స్పష్టంగా మాటల్లో ప్రకటించకూడదమ్మా ఇప్పుడేనాసూ! (ఇష్టంగా) మీరు నవీనకుమార్ చెల్లెలా?

మ—(నవ్వుతూ) అవును.

వ—(నిక్కచ్చిగా) అయితే, ఓ అమ్మాయీ నాకు తెలియక అడుగుతాను, అదేమన్నా ప్రజ్ఞా గొప్పా వ్యాఖ్యాస్త్రైత్యమా ఎరగని వ్యక్తిదగ్గర సంజ్ఞల ధోరణిలో పడ్డావ్? నవీను రానీ చెంప ఊడిపిస్తాను.

మ—(కష్టంగా) నేను మిమ్మల్ని ఎరగనని మీకెల్లా తెలుసూ? మా నవీను మిమ్మల్ని గురించి ఇదివరకే లక్ష చెప్పేశాడు నాతో.

వ—ఓహో! అల్లానా! (పెదిమిలు తెరవకుండా నవ్వుతూ) అయితే క్షమించండి. అయితే, నవీనకుమార్ ఎక్కడికి కెళ్ళాడండీ?

మ—(కళ్ళు మిటకరించి, నాలికతో పై పెదిమి మూలనించి మూలకి రాసి, కిప్పున ఎడమ మధ్యకి వెళ్ళి, వెంటనే వచ్చి) ఎక్కడికి కెళ్ళాడో చెబుతాగాని, మీరు ముందు కాళ్ళు కడుక్కోండి (అని నీళ్ళచెంబు పెడుతుంది).

వ—(మెత్తపడుతూన్నట్టు) అబ్బెబ్బే! నాకాళ్ళు సుబ్బరంగా ఉన్నాయండీ. ఎందుకు మీకీ శ్రమా?

మ—ఎంతమాటన్నారూ? ఇది సామాన్యధర్మం.

వ—మీరు సామాన్య ధర్మాలుకూడా సెలవియ్యాకంటే మరి, చచ్చిపోగలం. (అని నీళ్ళచెంబు తీసుగుని కుడి ఎదరికి వెడతాడు)

మ—(అతడు వచ్చేలోపల పీటవేసి, కొయ్యరొట్టె ఆకులోపెట్టి మంచినీళ్ళగ్లాసు పక్కని ఉంచుతుంది).

వ—(కుడి ఎదర్నించి వస్తాడు)

మ—ఇదుగో అంగవస్త్రం. ఈ పీటమీద దయచేసి, ఈ రొట్టెకాస్త ఫలారం చెయ్యండి.

వ—నా కక్కర్లేదమ్మా, మహాప్రభో! నే నిప్పుడే తిని వచ్చాను.

మ—వల్లకాదు, మీ కేం తెలుసూ! మా నవీను వచ్చి, నీకేం బుద్ధిలేదా? నా స్నేహితుడొస్తే కాస్త ఫలారమేనా పెట్టలేకపోయావా దెయ్యంలాగ! — అని నన్ను సాదించిపోస్తాడు. అందుకని నన్ను క్షమించి స్వీకరించండి.

వ—మీ అన్నగారంటే మీ కెంత భయమండీ! అల్లానే కానీండి! (అని, కూచోబోతూ) అయితే, సగం ముప్పాతిక తీసెయ్యండి. తీసెయ్యండి. లేకపోతే తీరా పరిహరించ వలిసొస్తుంది.

మ—మీ రొచ్చిన ఫరవా ఏమీ లేదు కూచుం మరూ! మీకు చల్లమాలిన మొహమాటంలా ఉందే?

వ—(రొట్టెతీసి కొరకబోయి అది కొరుకుపడక పళ్ళు నెప్పెట్టి ఏడుపు మొహం పెడతాడు.)

మ—బాగా ఉందాండి?

వ—ఓ. దివ్యచకోరంగా ఉంది. (అని తల ఊపుతూ, ఆవిడ కేసి తిరిగి నవ్వి, రొట్టె కేసి తిరిగి ఏడుస్తూ ఉంటాడు.)

మ—మరి కాస్త తెచ్చి వడ్డిస్తునా?

వ—వద్దువద్దు. నన్ను చంపుగున్నట్టు! (అని ఆవిడ కేసి తిరిగి నవ్వుతూ వెంటనే రొట్టె చూసుగుని ఉసూరు మంటూ—తనలో) జన్మాంతరం కాకపోతే నాకు ఈ రొట్టె దాపరించడం ఏమిటి? ఎంతగౌరవంతో కూడిన బాధలో పడ్డాను! ఎన్నేళ్ళు కొరుకుతూ కూచున్నా ఈ రొట్టె ఇంతే! ఇది అసలు గొడ్డళ్లకి స్వాదీనం అయే జాతికాదు.

మ—(లోపలికి వెడుతూ ఇవతలికి వస్తూ ఇంకా అతడికి ఏం వడ్డించనా అన్నట్టు తిరుగుతూ ఉంటుంది.)

వ—చూడమ్మాయి! ఇంకా కొంచెం మంచితీర్థం తెచ్చి పెట్టండి.

మ—(ఎడమ మధ్యకి వెడుతుంది.)

వ—(వెంటనే లేచి, రొట్టె పుచ్చుగుని, కుడి ఎదరకి పరిగెట్టి, అప్పుడే మళ్ళీ వచ్చేసి, ఆవిడ రాకుండానే కూచుని, మంచినీళ్ళు తాగడంలో పెద్దపెద్ద గుటకలు వేస్తూన్నట్టు అభినయిస్తాడు.)

మ—(ఎడమ మధ్యనించి వస్తూ) అప్పుడే తినేశారా?

వ—ఇదేం పని అని చెప్పేసి, ఒక్ఖమాటుగా యావత్తూ గుటకాయి స్వాహా, చేసేశాను.

మ—మరికాస్త తెస్తునా ?

వ—మరి వొద్దమ్మాయోవ్ ! ఇహ బతగను. కాఫీ ఏమీ లేదు. (అని నవ్వుతూ) మరి నాకు సెలవా ?

మ—ఉండండి వెదుదురుగాని, మీమిత్రుడే వస్తాడు.

వ—ఎక్కడికి వెళ్లాడో చెప్పారుకాదు, ఇందాక ణ్ణొంచి అడుగుతూన్నా !

మ—ప్లీడరుగా రింటికి.

వ—ఎందుకూ ?

మ—ఏమడుగుతారూ! మేం ఒక మనవర్తి వ్యాజ్యం వెయ్యాలి.

వ—వెయ్యండి. ఈలోపల నేను వెళ్ళి మళ్ళీ వస్తా లెండి.

మ—(ఒక చిన్నరుమాలు తీసి) నేను లేసుతో ఈ రుమాలు అల్లాను చూశారా ? అన్నట్టు ఒక్ఖక్షణం ఉండండి. (అని, రివ్వున ఎడమ మధ్యకి వెళ్ళి హార్మనీ తెచ్చి) ఇదుగో, ఈ హార్మనీ చూశారా ?

వ—(నవ్వుతూ) ఇదేనా ?

మ—ఇదేనా అంటా రేమిటీ ! ఇదే.

వ—ఇదా ! ఇంతకి పూర్వం ఎక్కడా చూడ లేదండి.

మ—అబ్బ! పూర్వంమాట కాదండీ, ప్రస్తుతం.

వ—ఓస్, ప్రస్తుతమా! చూస్తున్నాను.

మ—ఎల్లాఉం దంటారూ?

వ—ఎంత యిదిగా ఉండాలో అంత యిదిగానూ ఉంది.

మ—ఏమిటండీ, ఊరిఖేనూ! స్పష్టంగా చెప్పండీ, ఆలోచించీ!

వ—అసలు ఆలోచనే పోకుండా ఉంది. అయినా మీవంటివారు కోరి సప్పుడు చెప్పక తప్పదు. దీని తెలుపూ నలుపూ మెట్లు కలగలపుగా ఉన్నాయి. ఇది సరిగా ధ్వనిస్తుందని మీ ఉద్దేశమేగాని, ఇది సరిగాలేదు. సంసారి పక్షంగాకుడా లేదు. రూపం ఉంటే ఏమయినట్టూ!

మ—కేవల రూపమేకాదు. దీని నాదంకూడా ఎంత మనోహరమో గమనించ మనికుడా మిమ్మల్ని కోరు తున్నాను.

వ—(వినడం నటిస్తూ) నాకేమీ నాదం వినబడ్డం లేదండీ!

మ—సరి సరి. మీరు ఒకటోరకం దద్దమ్మలా ఉన్నారే, ఎక్కడోగాని! అవునూ! మూగతనం ఇష్టపడే వాళ్ళకి నాదం తెలుస్తుందా, స్వరం వస్తుందా!

వ—వచ్చేసరికి ఎంతసేపు పడుతుందో, వెళ్ళిపోతా నండి.

మ—స్వరం రావడమా! కొందరికి నిమిషం. మీరు ప్రయత్నం చెయ్యకుండానే నిరాశలో పడతారే! చూడండి తెలుస్తుంది, ఈ కర్రలో ఎంతగానం ఖైదుపడి ఉందో!

వ—ఏమోనమ్మా! నేను కనిపెట్టలేను. హార్మనీ జంతువు నాదాన్ని ఖైదు చెయ్యడమే కాదు, విరిచి, ముక్కలు చేసి, పోగులెట్టి నమిలి మింగేస్తుంది. హార్మనీ కొయ్య నాదానికి విరుగుడు. నావల్ల కాదు. మహాప్రభూ!

మ—ఇది సరిగాని, మీకు వివాహం అయిందా?

వ—అవడంలోనూ మళ్ళీ ఎల్లా అయిందనుకున్నారేమిటి? మా జోరుగా అయింది.

మ—(నవ్వి, గారాం సూచిస్తూ) అబ్బ! నిజం చెప్పండీ!

వ—(నవ్వుతూ) ఊరికేనే అన్నానండీ. మరోహాలా ఎంచకండి. షాతిగ మందొచ్చారు, రావడం. ప్రతీవాడూ తనపిల్లని నాకివ్వనని చెప్పి చక్కాపోయాడు, వీడిదుంప తెగిపోనూ! నామాటకేం గాని, మీకు ఏమాత్రమైనా కొంచెం వివాహం అయినట్టా?

మ—వివాహమూ అయింది, అన్నీ అయిపోయినాయి.

వ—అయ్యో! మీ మనవర్తికేనా వ్యాజ్యం?

మ—అవును.

వ—ఎన్నాళ్ళయింది, వారు గతించి?

మ—నాలాంటి మోహానికి ఆమాత్రం కూడానా? గతించితే యింకేం, తెరిపిగా బతికేదాన్ని.

వ—(ఆశ్చర్యంతో) తెలియక అడుగుతున్నాను, మీరు పునిస్త్రీలా, వితంతువులా?

మ—ఏదీ కాను.

వ—మిమ్మల్ని మీభర్త వొదిలేసి ఉంటున్నారా?

మ—తెలియని మాటలు అనకండి. వార్ని నేనే వొదిలిపెట్టాను, దేశంమీదికి! వారికి నామరూపాలు ఒక వేళ ఉంటే నావల్లే!

వ—అయితే, తమరిప్పుడు అనేమాటేమిటి? వారింకా గతించడంలో కృతార్థులు కాలేదుగనక మీరు నన్నుగాని మరొకర్ని గాని పెళ్ళాడ్డానికి శాస్త్రరీత్యా వీలు లేదే!

మ—దిక్కుమాలిన శాస్త్రం పోదురూ! పైగా, పెళ్ళి అనేవి కల్పించుకునేవే గాని, అదివరకే ఉండవ్ అమారుగా.

వ—అసంభవం అని హాస్యగా తెలిసిన విషయాల్ని గురించి బేరాలెందుకూ?

మ—పెళ్ళిమాట అన్నది నేకాదే!

వ—అయితే, మీరనేది తాత్కాలిక స్నేహమా?

మ—నా నోటంట కూడా అనిపించి నన్ను వంచన చేసి పారెయ్యాలని మీగోల. కాని, ఆమాత్రం అభిప్రాయం

లాంటిది ఎవరి మనస్సులో నక్కి ఉండదేమిటి! మీ హృదయంలో మాత్రం అల్లాంటి స్నేహాభిలాష సుతరామూ లేనే లేదాయేమిటి! అన్యజనం ఎవరేనా ఏమన్నా అనుకుంటారేమో అనే భయమే లేకపోతే ఎవరండీ తక్కువవారూ? మీరా?

వ—మీరు చెప్పేది నూటికి తొంభై పైచిలుకు సత్యం కావచ్చును. కాని, ప్రకటన ఎంతమాత్రమూ లేని సందర్భాల్లోకూడా, ఇతరుల మనస్సుల్లోకూడా ఫలానా మోస్తరుగా ఒక చెడ్డవ్యాపారం ఉండితీరుతుంది—అని, తమరు అనుకోవలిసిన కర్మం తమరికి ఎందుకు పట్టాలీ? అటువంటి భావం లేదు అని ఇతరులు తమ హృదయం సప్రమాణంగా చెప్పినప్పుడేనా తమర్ని తమరు ఎందుకు దిద్దుకోకూడదూ?

మ—ఎందుకు దిద్దుకోకూడదా! సత్యం అనేది ఈ కాండలో లేదుగనక! పైగా, మహాఋషులకంటె తమరు ఘనులు కారుగదా అనే ధైర్యం చొప్పున.

వ—రామరామ! నేను ఋషినేమి టండోయ్! శుద్ధ సచ్చిమనిషి మాత్రుణ్ణి.

మ—సచ్చికాకపోతే, యిక వ్యవహారం పండయేదేమి టింక! సరేలెండి మీరేమీ అనుకోకండి. ఊరికే మిమ్మల్ని పరీక్షిస్తున్నాను.

వ—మీరూ ఏమీఅనుకోకండి. కొందరు తెగ నిరీక్షిస్తూఉండి ఊరికే పరీక్షిస్తున్నాం అంటాగ్లెండి.

మ—మీ రుదార స్వభావులు.

వ—మీ రుదార స్వభావులు, కానట్టు మహా!

మ—మీకున్న అనుభవం గొప్పది.

వ—మీకైన అనుభవం చాలదు.

మ—మీరు లోకాతీతులు.

వ—మీరు వ్యాప్తి తీతులు. మిమ్మల్ని నేను కోరుకున్నప్పుడు మీరు నాకు యోగ్యతాపత్రం ఇయ్యాచ్చాలండి. అడగందే ఎందుకూ?

మ—అక్కడక్కడ మీవంటివా రుంటారు.

వ—మీవంటివారు ఇక్కడే ఉన్నారు.

మ—తమరు అక్కడికి మహా దారి తప్పనివారు గావున్ను, పాపం, స్వదేశీ ప్రవరాఖ్యులు!

వ—(ముక్కుమీద వేలెట్టుగుని) హరహర, నా సంగతి నాకే తెలుసు. నాలోట్లు నాకున్నాయి.

మ—ఇహనేం? అటువంటప్పుడూ!

వ—నవీను నన్ను ఎరుగును. ఎరుగున్నచోట ద్రోహం పాతకం. వైరం ఎంతమాత్రమూ లేనిచోట చేసిన ద్రోహానికి క్షమాపణ ఉండదు.

మ—ప్రస్తుతం మీ తిరస్కరణమే ద్రోహం.

వ—అని మీ అభిప్రాయం.

మ—నా అభిప్రాయంకాదు, నాప్రాయం. పైగా, ఇది తరుణం.

వ—తరణం సిద్ధింపచేస్తేనే తరుణం, లేకపోతేకాదు.

మ—కాకపోవడమేమిటీ! మీకు తెలియడంలేదు. తరుణి ప్రసాదించినదే తరుణం అంటేనూ!

వ—అది నేనెరగను. స్నేహమే నాకు లక్ష్యం. కొత్తస్నేహం వచ్చి పాతస్నేహాన్ని తుడిచేసెయ్యకూడదు.

మ—స్నేహమే మీకు లక్ష్యం అయితే, మీరు పుణ్యం కట్టుగోండి—పాపం నేను జమ కట్టుగుంటాను, ఈ ప్రవృత్తి నాదిగనక.

వ—ముద్దాయీ జడ్జీకుడా ఒకేమనిషి అయినప్పుడు కేసుతీర్పు మీరు చెప్పినట్టే ఉంటుంది.

మ—(కుడివేపుకాసి, తీవ్రంగా) ఆగండి. మీ పైపై మాటలు కట్టెయ్యండి. మీరు మొండివాదన మానేసి, మీ మనస్సులో ఉన్న కోరికప్రకారం అంగీకారం ఇస్తారా? లేకపోతే గోలచేసి జనాన్ని పిలవనా?

వ—మీరు సమర్థులు, మీయిష్టం!

మ—అయితే, కాస్కోండి. (పెద్దపెట్టున అరుస్తూ ఏడుస్తూ) బాబోయ్, దొంగాడండోయ్, చంపేస్తున్నాడండోయ్, నవీనూ, రారోయ్, అయ్యో, అయ్యో!

వ—(మహాదేవి మొదటి కేకతోనే, మూగాడులాగ మొరుగుతూ భయంకరంగా ఉరుముతూ చంగున గంతేసి కుడి వెనకకేసి పారిపోతాడు.)

(కుడి ఎదర కేకసి ఏమిటి ఏమిటి ఏమిటి
అంటూ కోలాహలం)

నవీను—(కుడి ఎదర్నించి వస్తూ, వెనక్కి తిరిగి చూసి) ఏమంటోయ్, మీరు అక్కడే ఉండండి. నేవచ్చాలెండి. (అంటూ రంగంమీదికి నడిచి) అమ్మాయి! చెల్లాయి! మహాదేవీ, మహాదేవీ! ఏమమ్మా! ఏమిటీ?

మ—(వరహాలు తప్పించుగుని వెళ్ళింతరవాత, తను కేకవేసి, కళ్ళు తిరిగినట్టై తూలి, కూచోపడి, ముక్కుమీద వేలేసుగుని, లెంపలువేసుగుని, పశ్చాత్తాపం సూచించి, పక్కకి పడిఉన్నస్థితిలో నవీను రాగా, పడుకుని కళ్ళుమూసుగునే ఉండి భయంవేసినట్టు నటించి వణుకుతూ) ఇక వెళ్ళు మరి చూస్తాను! మాఅన్నయ్య రానీ నీపని పట్టిస్తాను.

న—వచ్చానమ్మా, బాబూ, వచ్చాను. ఏమిటీ? ఎవరూ? ఏడీ?

మ—(వణకడం మానేసి, చటుక్కున లేచి, ఒళ్ళు విరుచుగుని, కళ్ళు నులుముకుని, మిటకరించి, చిటికేసి, చిరునవ్వు నవ్వి) ఏంలేదు, నవీనూ! ఏదో పీడకల వచ్చింది.

న—ఓసి నీ కల బంగారంగానూ! చంపేశావే! ఏమిటో అనుకున్నానూ! చెప్పలేం!

(తెర)

## రంగం-3

[స్థలం—వరహాలు మకాంలో ఒకహాలు. చాప పరిచి ఉంటుంది. పుస్తకాలు ఉంటాయి. కుడిఎడర నించి వరహాలువచ్చి ఎడమకి చూసి,]

వ—(తనలో) ఎవడో ఇటు కేసి కర్రపుచ్చుగుని వస్తున్నాడు. నా అపరాధానికి శిక్ష అవుతుంది గావును. చెల్లెలి మాట పట్టుగుని నవీను నన్ను తన్నించడానికి చేసిన ఏర్పాటై ఉంటుంది. చూద్దాం. (అని మళ్ళీ కుడిఎడరకి వెళ్ళిపోతాడు)

కో—(చంకని దుడ్డుకర్ర పెట్టుగుని, తూలుతూ, ఎడమ ఎడరనించి వచ్చి, ఆగి) ఎవడయ్యా, ఇక్కడా ?

వ—(కుడి ఎడరినించి వచ్చి) నేనే ! (అని ఠీవిగా నిలబడతాడు).

కో—నువ్వా ?

వ—అవును. నువ్వెవడవ్ ?

కో—నన్ను 'ఎవడవ్' అంటావ్ ? (అని నాలిక కరిచిపెట్టి కొట్టబోతూ) నేను నీకు భర్తగార్ని ! తెలిసిందా ?

వ—తెలిసింది (అని నవ్వి) మీ పేరు ?

కో—నా పేరు కోదండం.

వ—ఓస్. ఇంతేకదా ! అయితే ఎం జెయ్యమంటావ్ ?

కో——(కొట్టి) దండం పెట్టి ఏడవమంటాను. తెలుసునా! నా పేరు ఎందుకు అడిగావ్ ?

వ——ఊరికేనే (అని నవ్వుతాడు).

కో——అరే. సిగ్గులేదే సచ్చినోడికి! ఏడవమంటే నవ్వుతావేరా! నువ్వు నవీనుగార్ని ఎరుగుండావా?

వ——(గట్టిగా) ఆ. బాగా ఎరుగుదును.

కో——(అనుకరిస్తూ) బాగా ఎరుగుదువ్! (అని కొడుతూ) ఆలోచించకుండా అంత గట్టిగా సెప్పేస్తావేం?

వ——అదా! అల్లాయితే, ఎరగను.

కో——అదుగో! ఎందుకు ఎరగవ్? (అని మళ్ళీ కొడతాడు).

వ——(చొక్కా విప్పి పారేస్తాడు).

కో——అదేటి?

వ——నువ్వు తనివితీరా కొట్టుగోడానికి వీలుకోసం! (అని నవ్వుతాడు).

కో——నువ్వు యెంటనే యేడుత్తావా యేడవ్వా! (అని కొడతాడు).

వ——నే నేడవను.

కో——ఒరే, జాగర్త. పట్టుగుని ఉతిగానంటే, గూళ్ళు తొలిగిపోయి, తోళ్ళు రేగిపోయి, బుర్ర సిశార్లై పోయి, సత్తావు! కబడ్దార్! ఏడు, నామాటినీ, ఏడు!

వ——నీ యేడుపేదో నువ్వేడుద్దూ! నే నేడవను.

కో—నాకంటె మొండిజాతివేగాని యిను. నవీను గార్ని ఎరుగుండావా ?

వ—(వెకిలిగా నవ్వి ఊరుకుంటాడు.)

కో—ఊరుకుంటావేం ?

వ—ఎరుగున్నానో లేదో, ఏదో ఓటి!

కో—సరిగ్గా సెప్పమంటే ఏటి నీ జులుబూ ? (అని మళ్ళీ కొడతాడు.)

వ—పోనీ, నీయిష్టం ఎల్లానో అల్లాగే!

కో—నిన్ను సెప్పమని నేనంటే, నాయిష్టంఏటి ? (అని మళ్ళీ కొడతాడు) నీకు మతిలేదేంటి !

వ—లేదు.

కో—మతి లేకపోతే మతిలేదని ఎట్టా తెలుసు గుండాావ్ ? (అని మళ్ళీ కొడతాడు.)

వ—ధర్మజ్ఞులైన తమరే సెలవియ్యాలి.

కో—అన్నింటికీ నా పెభావమే కారణం, తెలి సిందా ?

వ—చిత్తం.

కో—నవీనంగార్ని ఎరుగుండావా ? సరిగ్గాచెప్పు.

వ—దీనికి సమాధానం నా మనస్సులో ఉంది. కాని, నాయిష్టం నాకు తెలియదు. నాయిష్టం సరిగ్గా తెలిసినవారు మీరొకరే. కాబట్టి, నాయిష్టం ఏమిటో ముందు మీరు నాతో ఓమాటు చెబితే, ఆతరవాత, ఇదుగో ఇది నా

యిష్టం అని నేను తమతో యధావిధిగా మనవి చేసుగుంటాను.

కో—బేష్! అయితే యిట్రా! సెవులో సెబుతాను.

వ—ఇక్కడ ఎవ్వరూ లేరు. పైకి చెప్పండి, నాకు చెముడు లేదు.

కో—నీకు చెముడు ఎంచేత లేదూ? (అని మళ్ళీ కొట్టి) ఏం?

వ—(కోదండం దగ్గిరికెళ్ళి చెవిపడతాడు.)

కో—(ఏదో రహస్యం చెబుతూన్నట్టు నటించి) నవీనుగార్ని ఎరుగుండావా?

వ—అది తమ చిత్తాన్ని బట్టి ఉంటుంది.

కో—బేష్! ఆయనకి కావలిసినోళ్ళ యిషయంలో ఎచ్చుతగ్గు యాపారం నడిపించావా లేదా?

వ—అదికూడా తమచిత్తాన్ని బట్టి ఉంటుంది.

కో—ఇప్పుడు నిన్ను చట్టప్రకారం ఎందుకు సిచ్చ కొట్టకూడదూ? సెప్పు.

వ—అదికూడా తమ చిత్తాన్ని బట్టి ఉంటుంది.

కో—నోరుమూసుకో. నేను 'సెప్పు' అని నిన్నడిగినా నువ్వు ఊరుకోవలిసిందే తెలుసా? నిన్నిప్పుడు ఎందుకు సావదంచకూడదూ? సెప్పు.

వ—(నోరుమూసుగుంటాడు).

కో—మాట్లాడవేంరా? (అని కొట్టబోతూ ఉంటాడు).

నవీను—(ఎడమ ఎదర్నించి) కోదండం, కోదండం! (అని కేకలు వేసుగుంటూ వచ్చి, కోదండాన్ని చూసి) ఒరేయ్, ఆగు, ఆగు.

కో—ఎవడ్రా నువ్వు? (అని కళ్ళు మూసుగుని బాదెయ్యడానికి నవీనుకేసి నడిచి, తన యజమాని అనిగ్రహించినట్టు నటించి ఆగుతాడు).

న—నేన్రా! ఆగు. ఎంత పొగరుగా ఉంది నీపనీ?

కో—అయితే, వచ్చేది తమరని యీడు నా కెందుకు సెప్పలేదూ మొదలా? (అని వరహాల్ని కొడతాడు).

న—ఓరి భడవా! ఉండమంటూంటే ఏమిట్రా అదీ!

కో—ఏటండీ! కొట్టడంపని సాయంత్రం ఉంటుందని సెప్పారుగా!

న—చెప్పాను, నిజమే. చెబితేమట్టుకు, వరహాల్ని కొట్టమన్నానా! ఉన్నాడేమో చూసిరమ్మన్నాను. ఏడిశావులే. ఇల్లారా. (ఇస్తూ) ఇదుగో రూపాయి. ఇదట్టికెళ్ళి సుబ్బరంగా భోంచెయ్. పూరాగా సోడా అవీ తాగేసెయ్. ఒక్క గంటలో నన్ను కలుసుగో. నీ అవసరం ఉంటుంది.

కో—సిత్తంబాబు! రేత్తిళ్ళప్పుడు, మిమ్మన్ని, ఒళ్ళు కమ్మేసి సైడుకాలువల్లోకి యీడిచే త్తే, ఎన్ని సేపలు

ఇంటికి మోసుకు పోయాను బాబు! నేను మంచోణ్ణి కానా?

న——సరే. మరి పేలకుండా నడు.

కో——(ఎడమ ఎడరికి గర్వంగా పోతాడు)

న——(కోపంగా) నిజమేరా, వరహాలూ!

వ——(దీనంగా) ముందు తన్నించావుగదా, ఏమైతేం!

న——చాలామంది అన్నారు రా!

వ——ఏమనీ?

న——ఆ అల్లరి కంతకీ మూలకారణం నువ్వే అని.

వ——అసలువాళ్ళు ఏమన్నారు?

న——సరి. ఇల్లాంటి సంగతులు అసలువాళ్ళని అడుగుతామా ఏమిటి? పైగా, నే నింకా అస లావిణ్ణి కలుసుగో లేదుగా!

వ——మరి నువ్వు మీయింటికి వెళ్ళలేదూ?

న——వెళ్ళాను. ఇంటిదగ్గిర్నించే వస్తూంటా.

వ——ఆవిడ ఇంటిదగ్గిర లేదుమరీ!

న——ఏడిసినట్టే ఉంది. ఆవిడ మా యింటిదగ్గిర ఎందుకు ఉంటుందీ! ఆవిడమాట అల్లాఉణ్ణీ. ఈలోపల మా బసలో చాలా తమాషాజరిగింది.

వ——ఏమిటా తమాషా?

న——మా చెల్లాయి హోరున ఏడుస్తోంది. 'అన్నయ్యోయ్, అన్నయ్యోయ్' అని కేకలెడుతోంది. జన

పోగవుతున్నారు! వాళ్ళని కసిరి పంపించేసి, సంగతేమిటని మా చెల్లెల్ని అడిగాను.

వ—ఏం చెప్పిందీ?

న—చాలా భయపడిపోయింది. దానికి నాదగ్గిర వల్లమాలిన భయం.

వ—అయిఉంటుంది. లోకంలో చెల్లిళ్ళకంటె ఈవిడకి భయభక్తులు ఎక్కువై ఉండచ్చు, పాపం! ఏమందీ?

న—ఏమీలేదు. 'ఏదో పీడకల వచ్చిందన్నయ్యా!' అంది.

వ—పాపం, చాలా నీరసంమనిషి గావును. లేకపోతే నరాలతాలూకు దీర్ఘవ్యాధి ఏదేనా ఉందేమో!

న—లేకపోవడమేమిటీ! దానికి మనోవ్యాధి! మొగుడు వొదిలేశాడు. వాడిమీద దావాకోసమే కదూ ఇక్కడికొచ్చాం. నేను ప్రతీరోజూ ప్లీడరుగారింటికి వెడుతున్నానని చెబుతున్నాను. అది నమ్మేసేస్తోంది.

వ—మరి ఎక్కడికి వెడుతున్నావ్? చెప్పడానికి ఇబ్బంది లేకపోతే చెప్పు.

న—చెప్తాను, రా. ఇల్లా కూచుందాం. (అని కూచుంటాడు.)

వ—(కూర్చుంటాడు.)

న—స్నేహం బాగా దట్టం అయినతరవాత గాని, కొన్ని కొన్ని ఆంతర్యాలు చెప్పేసెయ్య బుద్ధివెయ్యదు. నే

చెప్పడానికేం, గ్రంథం యావత్తూ చెప్పేస్తానుగాని, ముందు నువ్వు ఆసంగతి నిజమో కాదో చెప్పు, ఆవిణ్ణిగురించీ!

వ—ఏసంగతీ నువ్వనేదీ! ఎవర్నిగురించీ?

న—మిశ్చకోరం గురించి. సినీమాతార!

వ—ఏమిటి ఆవిణ్ణిగురించీ?

న—ఆవిడ ప్రవర్తన మంచిదికాదని నువ్వు చెప్పేస్తున్నావుట, నిజమేనా?

వ—రామరామ! నాకేమి అవసరంరా?

న—ఏమో! కాని, ఆవిడ ఎంతమంచిది, ఎంత మంచిది! నేను అయిదుసార్లు ఆవిణ్ణి చూశాను. ఆవిడ నాకేసి తిరిగి నాలుగుసార్లు నవ్వింది. మూడుసార్లు మాట్లాడింది. రెండుసార్లు కరకంపనం చేసింది. ఒక్కసారి ఒంటరిగాకూడా సమావేశం అయినాము. ఆవిడ ఎంత యోగ్యురాలో నీకు తెలుసా?

వ—నాకేం తెలుసూ? తెలియదనే చెబుతూంటా! నాకెట్లా తెలుస్తుందీ?

న—అంటే, నాకు తెలుస్తుందని నీ ఎత్తిపొడుపు. అబ్బో! నీకు తెలిసినవి నీకు తెలుసు. నువ్వు మడిగట్టుకుని కూర్చునట్టు కబుర్లు చెప్పకు నా దగ్గిరా!

వ—అంత కోప్పడతా వేమిట్రా! నాకు తెలియదు. నేను ఎన్నడూ ఎవ్వరిదగ్గిరా ఆవిడ ప్రసంగం తీసుకు రాలేదు. పోనీ, ఒక్కటి అడుగుతాను చెప్పు. ఇప్పుడు ఆవిడగొడవ నీకుమాత్రం ఎందుకూ చెప్పూ!

న—ఎందుకా! మంచితనానికి చెడ్డపేరు వస్తూంటే నేను భరించలేను.

వ—అయితే నన్ను ఇప్పుడేం చెయ్యమన్నావ్ ?

న—ఇంకా చెయ్యమని అనటంలేదు, వెనక చేశావు అంటున్నాను. ఆవిడ చదువుకున్నంత మాత్రాన్ని, వేషమూ వేషాలూ వేసినంత మాత్రాన్ని, నలుగురితోనూ కలిసి కట్టుగా ఉన్నంత మాత్రాన్ని, తగుదునమ్మా అని సిబోటి గాడు యాగీ చెయ్యడమేనా ?

వ—(లేచి) మహాప్రభో ! నాకేమీ తెలియదు.

న—తెలియ దేమిటి, బోలెడుమంది చెబుతూంటే.

వ—నీతో చెప్పినవాళ్ళు అనామకపు ఘటాలా ? వాళ్ళు బలాదూరూ. నామకులా! వెళ్ళి కనుక్కుందాం నడు.

న—అల్లా అంటే ఎల్లా! బోలెడుమంది.

వ—వాళ్ళపేర్లు చెప్పు, కొంతమందిని.

న—ఫలానా అని పేర్లు ఎల్లా దొరుకుతాయి, జన వాక్యం !

వ—ఒఖ్ఖపేరు చెప్పు, పోనీ ! బోలెడువద్దు—ఒఖ్ఖ బోలిగాడి పేరు చెప్పు.

న—ఎల్లా ?

వ—ఎల్లా ఏమిటీ? యథార్థమై ఉంటే ఎల్లా అంటూ కూర్చుంటావా ? ఆ బోలెడుమందిలో నువ్వే అసలు బోలెవి అన్నమాట ! జనవాక్యం అంటే నీ వాక్యం అన్నమాట !

నేను ఎవర్నో యోగీ చేశాననే కల్పనచేసి యోగీ సృష్టించి, పెంచి, పోకిస్తూన్నది కేవలం నువ్వు ఒఖడవే అన్నమాట! ఆ సంగతి ఒప్పుకో.

న—అబ్బా, ఎంత ఉపన్యసించావు! ఇంత అడ్డంగా వాదించగలడు నీబోటిగాడు, అనుకోలేదు నేను!

వ—నాబోటిగాడంటే ?

న—తనకివంకే లేదనుకునేవాడు.

వ—ఏమో! నాకు తెలియదు.

న—చాలా చిత్రంగాఉంది. నీకే తెలియదూ ?

వ—తెలియదు. నేనెప్పుడూ ఏజనుణ్ణీ అడగలేదు.

న—ఎంచేత ?

వ—నాకంటె నావిషయం వాళ్ళకి ఎక్కువ తెలియదుగనక.

న—నేచెబుతా విను.

వ—అడక్కపోయినా నా ?

న—అబ్బ, ఉన్న మాటైనప్పుడు అడిగించుగోకుండానే చెప్పి పారెయ్యాలి. మిస్ గోరువంకనీ నిన్నూ కలిపి ఓ తరవాయిలేకుండా అనుకుంటున్నారు, జనం!

వ—ఇదేనా నువ్వు నాతో మాట్లాడాలన్నావు ?

న—అవును. స్నేహితుడవ్. నీపేరు పాడైపోతూంటే చూస్తూ ఊరుకోనామరీ!

వ—ఎరుగున్నవాళ్ళే పేరు పాడుచేసేది. ఎరగని వాళ్ళకి పేరూ తెలియదు, పాడూ తెలియదు.

న——నీపేరు పాడుచేస్తూన్నది, నేనంటూవా ?

వ——నేనన్నానా ? ఏ 'జనం' మీందో పెట్టి నువ్వే తంటాలు పడుతున్నావు.

న——అవును. జనం అంటే ప్రపంచం. ప్రపంచాన్ని ఏకమొత్తంగా బుట్టలో పెట్టి దాచేస్తావా యేమిటి, నాకు తెలియక అడుగుతాను! నిప్పులేని పొగఉండదు. ఏదో రవంతైనా కమామిీషు లేందే, ఉత్తపుణ్యానికి ఎవడికి పట్టిందిరా ఇలాంటిమాట నీమీంద వెయ్యడానికీ ? ఎవడికీ లేదనుకున్నావా ఏమిటిపని !

వ——మిస్ గోరువంకకీ నాకూ. ఒక్కసందర్భంలోనే అయింది పరిచయం.

న——ఇహ నేన్మురీ ! దానిపేరే సంబంధం.

వ——ఒక్కసారే ! అనేకజనం యొక్క సమక్షంలో మాట్లాడాను.

న——చాల్రా, నీకు తెలియదూ ! ఆమాట్టాడ్డంలోనేఉంది గ్రంథం ! పోనీ, ఆవ్యక్తి నీతోనే మాట్టాడం ఎందుకూ ? నాతో మాట్టాళ్లేదే ! తక్కినవాళ్ళతో మాట్టాళ్లేదే !

వ——అదా ఏడుపూ ? మిశ్చరోరం సీతో లే మాట్టాడ్డవేం? మీ ఇద్దరిమీందా ఏం చెప్పుగుంటున్నారు మీ 'జనం?'

న——నామీందా ? నామీంద అవకతవక ప్రచారం సాగిస్తే జనాన్ని మూంతిమీంద కొట్టిస్తాను, జనం పళ్ళు గవ్వ

ల్లాగ రాల్తాయి. నేనా! అబ్బో! నాదారి వేరు. నా నిగ్రహ శక్తి నీదగ్గిర ఎక్కడేడిసింది? నీ కెట్లా వస్తుందీ? ఎట్లా నిలుస్తుందీ?

వ—నీకుమల్లే నే నెందుకు అనుకో కూడదూ? ఈమాత్రం 'అహం' తో వ్యవహరించ కూడదని మని షెవడూ?

న—ఎంతట గింజుకో! నీకీ ఆక్షింతలు పడ్డాయి! నీకూ మిస్ గోరువంకకీ సంబంధం అనేమాట తప్పదు. లోకం నోరుమయ్యడం కష్టం.

వ—నీ నోరుముయ్యడం కష్టతరం. నువ్వు మహా లోకానివి. జనం అంటే తనే. అనేకత్వంలో ఏకత్వం ఇదే గావును—లేక ఏకత్వంలో అనేకత్వమో!

న—చాలా తభిసీళ్ళు చూసినవా ళ్ళున్నారు.

వ—ఆశ్చర్యం ఏముందీ! స్త్రీపురుషుల పరిచయం అంటే భౌతిక సంపర్క నిమిత్త మాత్రమే అని కొందరి ఉద్దేశం.

న—తెగేసి! ఇంకా మెల్లిగా 'కొందరి' ఉద్దేశం అంటా వేమిటే! మెడమీద తలఉన్న ప్రతీవాడి ఉద్దేశం కూడా అంతే—అది యితరుల వ్యాపారం అయినప్పుడు! ఆమాటకొ స్తే, నా ఉద్దేశమూ నా అనుభవమూ కూడా అంతే!

వ—అటువంటి ఉద్దేశం ఉన్నవాళ్ళు, అన్య స్త్రీ పురుషుల పరిచయాన్ని స్నేహ మనీ, దోస్తీ అనీ, మోహం

అనీ, అరమరలు లేకపోడం అనీ, వేళపాళలు లేకపోడం అనీ, పూసుగు తిరగడా లనీ, సంబంధం అనీ, న్యాయం అనీ అనేసి, ఇంకా కనితీరక, మాటలు డబ్బెట్టి కొనుక్కొ రావలిసిన అగత్యం లేకపోబట్టి ఉన్నసంగతికి మరి నాలుగు స్వంత కవిత్వాలు సంపుటీచేసి గర్భధారణం, పుత్రజననం కుడా జరిగినట్టు మాట్లాడుతూ, ఆ ఊహా శిశువుకి నామకరణం చేసి, వాడికి కుడా ఎవ రెవరితో సంబంధమో స్థిర పర్చేస్తారు.

న—కొందరు అల్లా అంటారు కాని అవన్నీ అబద్ధాలే—అని అర్థం వచ్చేటట్టు నువ్వు మాట్లాడు తున్నావు. కాని అవన్నీ జరిగి ఉండడం అనేది కుడా అక్షరాలా నిసలు.

వ—అయితే చాలా సంతోషం. కొందరు అటువంటి సందర్భంలో తమరు ఉండి ఉంటే ఏమి ద్రోహం చేసి ఉండేవారో అటువంటి ద్రోహమే మరొకడు మాత్రం ఎందుకు చేసిఉండడని లోపల నిశ్చయం చేసుగుని, పైకి అదిఒప్పుగోక, మీదుమిక్కిలివ స్తేగాని మనస్సుకుళ్లు ప్రకటన చెయ్యక్కర్లేదుగనక,—అటువంటి సందర్భంలో తమరే గనక ఉండిఉంటే తమరు మహోత్కృష్టంగా వ్యవహరించి ఉండేవాళ్ళం, అని చెబుతూంటారు.

న—ఎవళ్ళచూటో ఎందుకు? నేనంటే.

వ—సరే. నన్ను నువ్వు నమ్మువన్నమాట.

న—నేను సత్యం నమ్ముతాను.

వ—ఈ వ్యాపారాల్లో, ఊహాగానమేగాని, శుద్ధ సత్యం దొరకదే!

న—నువ్వనేది ప్రత్యక్ష సాక్ష్యంమాట గాఫును. అది అక్కర్లేకుండానే బోలెడు ఇతర ప్రమేయాలు సత్యాలని తేగేసి ఋజువుచేస్తున్నారు. అయినా స్థలం, సమయం, సందర్భం, ఒడుపూ, వాలకం, నెపం, తరుణం, కర్మం—చాలా ఉంటాయిరా, ప్రతీవాడికీ తెలుసూ!

వ—ఏమోరా! ఇందులో నమ్మకమే సత్యమూనూ, సత్యం అనుకుని నమ్మడమూనూ!

న—నాకు నీయందు దోషం ఎంచాలని లేదు.

వ—వెయ్యిమంది ఎరగనివాళ్ళదగ్గిర గౌరవం పోయినాసరేగాని, ఒక్క ఎరుగున్నవాడిఎదట కానిమాట పడడం కష్టం.

న—ఎరుగున్నవాళ్లైతే చిక్కులు మింగేసి తప్పులు క్షమించేసి ఊరుకుంటారు. ఇటువంటి వ్యాపారాల్లో ఎరగనివాళ్ళు చెప్పినముక్క తప్ప ఇతరం సుతరాం నమ్మకూడదు.

వ—చాల్రా, పోతాను. మఱి పోగొట్టావ్, నీధర్మమా అని.

న—ఉండరా.

వ—నీ స్నేహానికీ నీకూ ఓదణ్ణం. ఇంతటితో వొదిలి పెడితే చాలా సంతోషిస్తాను.

న—నీకు కోపం వస్తే నే చెప్పలేనుగాని, ఇటువంటి దోషం ఉంటే, తప్పకుండా అల్లరిచేసి తీరవలిసిందే! లేక పోతే సంఘం పాడైపోతుంది.

వ—సరేసరే. సంఘం పాడవకుండా చూడు. దానికి నువ్వేదిక్కు. నన్ను తిట్టడానికి వంక వెతుగు. నేను దోష ప్రచారం చేశానని మొదటఅని, ఇప్పుడు దోషమే చేశా నంటున్నావు. ఏదోవంక !

న—ఏదోవంక ఏమిట్రా! గోరువంకే! అసలు మిస్ గోరువంక పరిచయం కాస్తంటే కాస్తే ఆయిరి, నువ్వు ఎందుకు చేసుగోవాలి చెప్పారీ!

వ—నన్ను వదల్రా బాబూ!

న—ఇల్లాంటి చిక్కులు వస్తాయనే, ఇటువంటి విష యాల్లో నేను ఎక్కడా జోక్యం అన్నమాట కలిగించుగోను- ఆత్మపరీక్షకోసం మిశ్చకోరాన్నిమాత్రం చూశాను.

వ—పోతాను, సెలవ్.

న—(అదే ధోరణిలో) అనవసర జోక్యాలు కలి గించుగుంటే మాటొస్తుంది. మాటొచ్చిం తరవాత పోదు.

వ—ఒరేయ్! నువ్వు ఈవిషయంలో లీనం అయి పోయినట్టున్నావు. మరి నన్ను చంపుగుతినక, ఓపనిచెయ్! ఆంధ్ర స్త్రీపురుష రహస్యసంబంధ అపవాద సంఘం ఒకటి లేవదియ్యి. లేవదీసి అందులో వరసనిచేర్చు—ఎవళ్ళనీ... తల్లి దండ్రి గురు దైవాల్ని తిట్టడం స్వయంకృషివల్ల నేర్చినా

పరయా తిన్నగా చెప్పకపోడంవల్ల తమ భాషాక్షరాలన్నీ తిన్నగా రాకుండానే ఏపుగా పెరిగిన విద్యార్థుల్నీ, అదు పాష్టలు లేని అన్య కన్యల్నీ, సంసార సంతాన మాన మర్యాదలు లేని స్త్రీరత్నాల్నీ, పని పాటలూ జ్ఞానైశ్వ ర్యాలూ పేరుప్రతిష్ఠలూ పౌరుష పరమోద్దేశాలూ లేక, అవి పోతాయేమో అనే భయం అసలేలేక, పరగౌరవం లోంచి తెగ్గోసుకొచ్చిన ముక్కలు స్వంతానికి సంక్రమిం చడమే తక స్వంత అగౌరవంలో ఉండగల లోట్లు పూడ్చు కోడానికి ఉపచరిస్తాయని భ్రమిస్తూ గర్వంతో కులుకు తూండే బుద్ధాయి దిప్పకాయి రాలుగాయి రకాల్నీ, చిలక్కొట్లసీ, తోక తెగిన నక్కల్నీ, పరహింస సాధించా లనే పరమావధితో బతికుండగానే తమ పేరు తమ రే నాశనం చేసుకునే ఆకాశ రామన్నల్నీ, అపసవ్యంగా ఆర్జించిన ధనంవల్ల అల్పహృదయం వెనక్కిపోయి కుళ్ళు నాలిక ముందుకి వచ్చే పెద్దల్నీ, కస్తూరీ పట్టుబడకుండా చూసే టందుకు సాయపడగల సాధనాలు గోళ్ళచివర ధరించి ఉండే పొట్టకూటి యంత్రాంశ తాల వాళ్ళనీ,...గౌరవ సభ్యులుగా జేర్చు. ఆ సంఘం క్రమేపీ ప్రపంచ మంతటా వ్యాపించి, ఉంటున్న సంఘాన్ని నీతివంతం చేస్తుంది.

ఆ—సరి సరి. నీ మేలగా, నీ పురోవృద్ధీ నేను కోరి, కొంచెం నీకు పోసీ సలహా చెబుదాం అని యత్నిస్తూంటే, ఓ యాభై శ్రీరంగ నీతులు నువ్వే నాకు చెప్పి, జనవాక్యం తోసి

పారేసి, ప్రపంచాన్ని ధిక్కారం చేస్తున్నావే! తనదాకా వస్తే ఇల్లానే ఉంటుంది.

వ——నువ్వనే జనం మాయధారి జనం కాకుండా ఉంటే, జన తీర్మానానికి నేను బద్ధుణ్ణి. సంఘం నీకొక్కడికే వకాల్తీ ఇచ్చిందంటున్నావు. నువ్వు నను శిక్షించు. ఇందాకటి మహానుభావుణ్ణి పిలు.

న——చచ్చ. ఊరికే అన్నాన్రా. రా. కూచో.

వ——(కూచోబోతూ) బతగనియ్యరా బాబూ, నన్ను నాయింట్లో! స్నేహం అని పేర్నా, ఎంతకావాలో అంతా అయింది.

న——అయితే...మిశ్చకోరం......

వ——అబ్బబ్బ! సీతో యాతనగాఉందే! మరోటి ఏదేనా మాట్లాడరా మహాప్రభో!

న——(నవ్వి) నువ్వొక్కడవే కాదురా, చాలామంది ఎరుగుదురు...

వ——ఏమనీ?

న——ఆవిడ మంచిమనిషి కాదేమో, అని.

వ——అయితే ఎందుకు కాకపోతే ఎందుకూ! నువ్విప్పుడు అనవసరంగా జోక్యం కలగచేసుకోడం లేదూ?

న——అహఁ. ఊరికే సంగతికోసం చెబుతున్నా. 'సంగం త్యక్త్వా కరోతి యః' అన్నాడు. నేను జోక్యం కలగ చేసుకుండా సత్యం స్థాపించగల ఘటాన్ని. ఏకత్రని నిప్పుంటే

ఆకఱ్రే కాల్తుంది. పాపపుణ్యాలు భగవంతుడికి తెలుస్తాయి. మన కెందుకు మధ్యా !

వ—(తనలో)—వీడికి అసలు మోతాదు పడితేగాని, ఈ వ్యాధి విజృంభించదు. (అనుకుని, తమాషాగా నవ్వడం ప్రారంభిస్తాడు.)

న—ఏమిట్రా, నవ్వేస్తున్నావే?

వ—నామీా దెబ్బ్టావుగనక, నేనిందాకణ్ణించీ వొత్తి వాదనకోసం వాదించాన్రా. మిశ్చకోరం గురించి నేను యాగీచేసినమాట నిజమే. భయమా? మళ్ళీ యాగీ చేస్తాను, ఇంకా చేస్తాను. యథార్థం చెప్పడం తప్పా? అది చాలా గ్రంథకర్తరా బాబూ నువ్వింకా దోడ్డిదార్నే ఉన్నావు. నువ్వేం విన్నావ్, నాకు తెలుసు బోలెడు.

న—ఓరి, నీ తస్సలమందూా! నువ్వు అందర్నీ ఎరుగుదువురా, ఇంతాచేసీ! ఇందాకా, ఆవిణ్ణి నేను పొగిడీసట్టు మాట్లాడానుగాని, ఆవిడ యోగ్యురాలు కాదని నాకూా ధైర్యమే. ఆవిడ అయోగ్యత నీనోటంట ముందుగా వస్తే నాకు చాలని తంటాలుపడ్డాను. నీముఖతా అనిపించాలని గాని, ఆవిడసంగతి నాకూా తెలుసు.

వ—నీ మొహం నీకేం తెలుసూ? ఆవిడ దర్శనానికి టిక్కట్టు పాతికరూపాయిలు. తెలుసా?

న—ఛీఛీఛీ. పాపంగుడాను! (తనలో) నా అంచనా సరిగ్గాఉంది—(పైకి) నువ్వంత ఘంటాపథంగా చెప్పెయ్యడం

బాగుండలేదు. కొంతవరకు ఆవిణ్ణి అల్లరిపెట్టినా, మనం ఆవిణ్ణి మరీ గోల చెయ్యకూడదు.

వ—ఎంత చెడ్డా స్నేహితుడివిగదా అని నేను నీతో ఈ కిటుకు కాస్తా చెప్పేశాను. ఊరమ్మట బయల్దేరి ఈవార్త ప్రకటించావా, నీకే ముప్పు.

న—రామరామ! సంగతివచ్చిన కాస్సేపే తప్ప, మనకెందుకోయ్ పాడుసంగతులూ!

వ—మరి నే ఉంటాను.

న—ఉండు. నేవెళ్లొస్తాను. సెలవలకి ఇంటికెడతావా?

వ—అప్పుడే వెళ్ళను. మా ఊరొస్తే కనపడేం.

న—ఎంతమాటా!

(అని, సంతోషంతో గంతులేస్తూ, నడుస్తూ, జేబులోంచి రూపాయలు తీసి లెక్కెట్టి, ఇరవై అయిదు ఇరవై అయిదు రైట్, రడీ అనుకుంటూ, ఎడమ ఎదరకి నిష్క్రమిస్తాడు.)

## రంగం-4

[ మిశ్చకోరం ఇంటిఎదట — ఇల్లు ఎడమవైపు—రాత్రి 8 గంటలు — మొదటితెర ఎదట — కుడి ఎదరనించి నవీను జోకుగా తల దువ్వుకుని, తాంబూలం నములుతూ, ఠీవిగావచ్చి, ఒక అంగవేసి, వెనక్కి తిరిగి ]

న—(మాట నొక్కుతూ, కోపంగా) ఒరేయ్, కోదండం! కోదండం! ఎక్కడో, బురద పాంలాగ కాళ్ళీడుస్తూ ఏడుస్తూ నడుస్తాడు. కోదండం!

కో—(రంగం మీదికి అడ్డ దిడ్డంగా ప్రవేశించి, ఎవర్నో కొట్టడానికిలాగ నటిస్తాడు).

న—ఒరేయ్, నీ చేతికిచ్చిన పొట్లాలూ పళ్ళూ అవీ ఏవీ?

కో—(కళ్ళుమూసుగునే ఉండి) నా కాకలైంది.

న—హారి నీ దుంప తెగిపోనూ! సరే! పోనీ తిన్నగా ఉందూ! అల్లా రెచ్చిపోతున్నావేం మరీనూ! ఎవర్నీ కొట్టమని నేను నీతో అనందే!

కో—(నవీనుని కొట్టబోతాడు).

న—నేను నీకు యజమాన్నిరా, నీమొహం ఈడ్చా! నన్నే బాత్తావా యేమిటి? ఆగు.

కో—మరి నే నెందుకూ? నన్నెందుకు పిల్చారు నువ్వీ! ఎవర్నైనా కొట్టింపించండి, లేకపోతే మీరే తినండి.

న—అల్లాయితే ఇదుచ్చుగు ఏడవరా దెక్కుమా లాడా! (అని ఒక కూపాయి యిస్తాడు) దాహం అవుతూంటే వెళ్ళి చటుక్కున, రా.

కో—(సర్దుకుని, దణ్ణంపెట్టి) బాబు!

న—నువ్వు నిమిషంలోవచ్చి ఎదరింటి అరుగుమీద నిద్దరోకుండా పడుకో. కర్ర దాచెయ్. అవసరం ఉంటే పిలుస్తాను. తెలిసిందా?

కో—సిత్తం. (అని, కుడిఎదరికి తూల్తూపోతాడు).

(రెండో తెర లేస్తుంది).

మి—(కుడిమధ్యనించి ఎడమ మధ్యకి పోతూ ఉంటుంది).

కో—ఇదుగో. ఇప్పుడే యింట్లోకి వెళ్ళి తలుపు వేసేసుగోబోతోంది. చకోరంగారూ! మిశ్చకోరంగారు! తలుపు తలుపు!

మి—(ఎడమ మధ్యనించి వచ్చి) ఎవరది?

కో—ఎవరున్నారు! మీ ప్రియస్నేహితులు.

మి—(రెండుకుర్చీలు ఇవతలికి జరిపి, ఒకటిచూపించి, రెండోదానిమీద కూచుంటుంది.)

కో—ఏమీలేదూ! ఒకసారి మిమ్మల్ని చూసి (అని, సిగ్గుపడి, తల తిప్పుతూ, కిందచూస్తూ, చేతగా నవ్వుతూ) వెళ్ళాలని వచ్చాను.

మి—నే నిప్పుడే పిక్చర్కొంచి వచ్చాను. మీకు తొందరగా ఉన్నట్టుంది. మీరొచ్చింది నన్ను చూడాలనా? చాలా ధన్యురాల్ని. (నవ్వుతూ తన కుర్చీ అతడి కుర్చీకేసి లాగుతూ) చూడండి. (అని, బొమముడితో) మీ దేవ్వరు? మీ రెవరు?

న—సరే. నన్నెరగనట్టే పూర్తాడతా వేమో. ఆవిడ! ఎవరేనా వింటే నవ్విపోతారు కుడాను.

మి—నిజంగానే. మిమ్మల్ని చంపుగున్నట్టు! మిమ్మల్ని నేనెరగను (అని, నవ్వుతుంది.)

న—(కోరగా చూస్తూ) నేను మిమ్మల్ని ఎరుగుదును. (అని, ఆగి)...ఆఁ, నువ్వు ఇదివరకే నాతో ప్రసంగించావు.

మి—క్షమించండి. నాకు జ్ఞాపకం లేదు. ఎక్కడా?

న—ఒకసారి రైల్లో.

మి—ఎప్పుడూ?

న—అప్పుడు నేను సిగరెట్టు పీలుస్తూ మీరు పక్కన కూచుండగా, మీ కేసి ఓ వాడిచూపు చూశాను. ఆపళంగా మీరు తనూంపాగా నా కేసి మళ్ళీ చూసి 'అబ్బ' అనుకుంటూ ముక్కు మూసుగున్నారు.

మి—అవునండోయ్. (అని నవ్వుతూ) అవును. ఒకసారి రైల్లో నాపక్కని ఒక తుంటరి కూచుని అల్లరి మొదలెట్టాడు వెర్రిమొహం వేసి.

న—(కోపంగా) నేనే కూచుంటా! మాటలు తిన్నగా రానీ.

మి—క్షమించండి. అప్పుడు ఏమని మాట్లాడానూ?

న—వేరే ఏదో మాట్లాడాలా ఏమిటి? ఆచూపు చాల్దూ! అది లక్షమాటలు చేస్తుంది. పైగా 'అబ్బ' అన్లేదూ మీరప్పుడూ? అది కేవలం నాతో మాట్లాడడమే అని మీ లోపలి అభిప్రాయం అయినట్టు మీ వాలకం స్పష్టంగా చెప్పింది.

మి—(నవ్వుతూ) ఓహో! అల్లానా? తమదగ్గిర ఎంత ఇంగ్లీషువాసన కొడుతోందండీ! మీరు గట్టిమూర్ఖులులా ఉన్నారు. క్షమిస్తే చెబుతాను, అప్పుడు మిమ్మల్నిగాని మీ చూపునిగాని నేను గమనించనేలేదు. అది సరేగాని, ఇప్పుడు తమరు ఎందుకువచ్చారు?

న—(తనలో) ఎల్లానురా బాబూ చెప్పడమూ? (పైకి) ఒస్! అక్కడికి తనకి తెలియనట్టు మహా!

మి—నిజంగా నేనండీ! మీరు ఇదివరకే చచ్చినంత ఒట్టూ!

న—(తనలో) ఓసి దిక్కుమాలిదానా! అల్లా తిడుతోందేం మరీనూ! (పైకి) ఆఁ, నీకు తెలియకపోడవేమిటే, నాచేత అనిపించాలనీ!

మి—(నవ్వుతూ) చాలుగాని, చెబుదురూ!

న—(తనలో) దిక్కుమాలికర్మం! నాకు మొదణ్ణించీ తగని భిడియం.

మి—మీరు చెబితేగాని మిమ్మల్ని వొదిలిపెట్టనండీ, ఏమైనా సరేగాని !

న—(తనలో) దీనికి మతి చలించిపోయింది. నిజమే! నావంటివాణ్ణి చూసింతరవాత ఈ స్త్రీజాతి ఆగగల్గొంమరి! దుర్బల మానవ శరీరాలుగా, మానవ శరీరాలు !

మి—మీరు సందేహిస్తున్నారు.

న—(ఉలిక్కిపడి) ఏమిటి నీ ప్రశ్న ?

మి—(నవ్వుతూ) తమరు వచ్చిన కారణం.

న—సరి. నాకేం తెలుసూ ? నువ్వు ఆకర్షించేశావ్. వచ్చేశాను. నువ్వు నన్ను ఎందుకు ఆకర్షించాలి చెప్పూ! నువ్వు కొంచెం తిన్నగా ఉండకూడదూ ! ఉంటే నాదార్ని నే పోయేవాణ్ణిగా ! వేషాలేస్తావ్ నాదగ్గిరా ! (అని తీవ్రంగా చూస్తాడు).

మి—(నవ్వుతూ) నాబుద్ధికి గోచరించని ఆకర్షణ చేశానేమో మిమ్మల్ని నాకు తెలియదు.

న—సరె. తెలియ పవప్పుడు నే చెబుతున్నా, విందూ, మునిగిపోలేదూ !

మి—మీ ఉద్దేశం స్పష్టం కాలేదు.

న—అల్లాయితే నిన్ను ప్రేమించి వచ్చానే! సరా! అబ్బ ! ఎంతబరువు మనస్సుకి వొదిలిపోయిందిరా, రామచంద్రా ! నిన్ను ప్రేమించానే !

మి—అదేమిట్రా, నన్ను నువ్వు ప్రేమించడం ఏమిటీ? (అని, నవ్వుతూ) ఇదెప్పణ్ణించి రా, నీ మొహం మండా!

న—(తనలో) నవ్వువల్ల కొంతప్రోత్సాహం ఇస్తోంది కాని, మళ్ళీ ఆ నవ్వు మీద పెట్టుగుని ఒరే ఒరే అని పిలుస్తూ తిట్టిపారేస్తోంది, దిక్కుమాలి పీనుగు! వరహాలు గాడి మాటచొప్పున పాతిగ రూపాయలూ కూడా పట్టు గొచ్చాను. ఈ శని ఆ కాసిని రూపాయిలూ లాక్కుని రోజ్జుచ్చుకో మనదుగద!

(పైకి) నువ్వు నన్ను ఒరీ, ఏంరా అంటూండడం తప్పు. మనిద్దరికీ ఇంకా అంత దోస్తీ ఏర్పడలేదు. నేను చదువుకున్న ఘటాన్ని. అసలు నాది మెత్తని మనస్సు అవడంవల్ల, ఇల్లా లొంగిపోయాను గాని, లేకపోతే నువ్వు వెయ్యి జన్మలెత్తి తపించినా నీకు స్వాధీనం అవుదునా! నువ్వు మరిగాని సరసం తప్పించి మాట్లాడుతూ కూచుంటే, కోదండంగాణ్ణి లోపలికి పిలుస్తాను, జాగర్త.

మి—వాడెవడూ? ఇంకో డొచ్చాడా ఏమిటి నీ కూడా! నువ్వు ఎక్కడేనా రోజూ రాత్రిళ్ళు తన్నులుతిని పడిపోతూంటే నిన్ను ఇంటికి మోసెయ్యడానికి వాణ్ణి కుదుర్చు గున్నట్టున్నావ్! (అని నవ్వుతుంది)

న—(తనలో) హారి, దీని తెలివితేటలు మండిపోయ్, సంగతి సమూలంగా లాగేస్తోందే! (పైకి) ఏమిటి ఇప్పుడు పేలావ్? మళ్ళీ పేలూ!

మి——నేను పేలలేదు, పేల్చాను. మళ్ళీ పేల్చనా?

న——ఇదా చదువుకున్నావ్! ఎవడు నిన్ను పరీక్ష ప్యాసు చేసిందీ! నేను పేలడం అంటే నువ్వు పేల్చడం అంటావే!

మి——పేల్చడం అంటే లెంపకాయ అన్నమాట. (అని కొట్టి) తెలిసిందా?

న——(దవడ పట్టుగుని) ఓసి రాక్షసి కుంకా...కుంకీ! నీకెమొచ్చిందే అల్లా కొడతావు! (అని, కుడి ఎదరక పగి గట్టి)——ఒరేయి, కోదండం, కోదండం! వీడు పోయాడు వీణ్ణి తగలెయ్యా! తాగి ఎప్పుడొస్తాడో, వచ్చి నన్నే కొడతాడో!

మి——(లాలనగా) నిజంగా తగిలిందా ఏమిటండీ! ఊరికే నవ్వులాటకి ఇట్టే అన్నాను. కూర్చోండి. (అని తీసు గొచ్చి కూర్చోపెట్టి) అయితే, మీరు నన్నింత ఆలస్యంగా ప్రేమించడం మొదలెట్టారేం?

న——తీరుబడి లేందే!

మి——మీకు అంత ఎక్కువగా సంసార బాధలు ఉన్నాయిగావును!

న——ఏడిసినట్టే ఉంది. నేను పెళ్ళి చేసుగోలేదు. అసలు పెళ్ళి చేసుగుంటానా అనేదికూడా సమస్యే.

మి——మరి తీరుబడి లేదన్నారు!

న——తీరుబడి అంటే నాకుకాదు, నీకూ! నీచుట్టూ ఎప్పుడూ జనమేగా!

మి—నేను తీరుబడిగా ఉన్నానో లేదో చూట్టం తప్ప మీ కేమీ ఇతరపని లేనే లేదన్నమాట ?

న—అదిగూడా ఓ పనేగాని, అడ్డదిడ్డపు ప్రశ్న లెయ్యకు, కోదండాన్ని పిలవగల్ను.

మి—క్షమించండి. నన్ను వివాహం చేసుగోడానికి వచ్చారా మీ రిప్పుడు ?

న—లేదు.

మి—ఏం ?

న—నేను రెడీలో లేను. పైగా మా పెద్దవాళ్ళని అడగాలి.

మి—వాళ్ళని మట్టుకు అడగడం దేనికీ ?

న—నేను వాళ్ళవాణ్ణి కాదుమరి ! అందుకూ.

మి—మీరు కేవల తాత్కాలిక సంపర్కం ఆశించి వచ్చారా ?

న—(కోపంతో) ఔనే ! ఏమిటి ఊరిఖేను వాజమ్మ లాగ ! గ్రహించుకోడం లేదు, నీ బొందా లేదు. ఇంకా తెలిగించమంటావు !

మి—(నవ్వుతూ) దీనివిషయంలో మీ పెద్దవాళ్ళని అడగక్కర్లేదూ ?

న—అక్కర్లేదు.

మి—ఏం ?

న—ఈ శరీరం నాదే కాని వాళ్ళది కాదుగనక.

మి—ఆహాహా! ఏం చమత్కార తర్కమండి మీంది!...సరే సరే. కాని, నాలో ఏం విశేషం గమనించి ఇలా వొచ్చా రిప్పుడూ ?

న—విశేషం ఏముందీ ? పెద్దపేరుగా నీది!

మి—అటువంటిపేరు ఇప్పుడు చెడగొట్ట దల్చుకుని వచ్చారా ?

న—ఏడిసినట్టే ఉంది. పేరంటే హోరన్నమాట. ఎక్కడేనా నీ పేరు చెప్పేసరికి తాటాకులు కట్టనివాడూ, అక్షింతలు వెయ్యనివాడూ, యాగీ చెయ్యనివాడూ, నీచ హాస్యవస్తువుగా గణించనివాడూ, లేడు. కాని, నేనుమాత్రం, అట్లా చెయ్యక. నిన్ను వెనకేసుగొచ్చి, వాళ్ళతో వాదిస్తూ, నువ్వు మంచివాడివని, నొక్కి చెప్తూంటాను.

మి—అంత శ్రమపడి ఎందుకోగదా మీరు నన్ను వెనకేసుకు రావడం !

న—(తనలో) ఎందుకంటే, ఎందుకైనానూ ! నేను ప్రత్యక్షంగా నీకు ఓ దరఖాస్తు పారేసినప్పుడు నువ్వు కాస్తంత మొహమాటంతో అనుకూలమైన తీర్పు ఇస్తావేమో అని. (పైకి) నేను స్వతహా మంచివాణ్ణి గనక !

మి—అది బాగానే ఉంది గానండీ, మీలో ఏం విశేషం ఉందని మీ ప్రేమగురించి మీరు నాదగ్గిర చెప్పొచ్చారండీ ?

న—నువ్వు ఎవళ్ళతో స్నేహం కడుతున్నావో ఆ వెధవలకంటె నేను తక్కువ తిన్నవాణ్ణి కాను గనక! ఆ సన్నాసి పీనుగులపాటి వాణ్ణి కాను, నేనూ?

మి—వాళ్ళల్లో చాలామంది ప్రజ్ఞావంతులు ఉన్నారు. మీ ప్రజ్ఞ, ఒకవేళ ఉంటే, ప్రదర్శించండి.

న—అల్లా అడిగావు; కాస్కుంటాను. ఏ ప్రజ్ఞ?

మి—గానం.

న—సరే. ముందు గానం. గానము నంటి విద్య మరి గానము. గానం రెండు రకాలు - యంత్రం; గాత్రం. జంత్రం ఏ వీణో తీసుకురా. నీ కళ్ళముందు మూడు నిము షాల్లో నా తడాఖా చూపిస్తాను. ఇదుగో గాత్రం! (అని కంఠం చూపిస్తూ) కళ్ళెట్టుగు చూడు. ఎంత రమ్యంగా ఉందో! (అని పాడతాడు—ఆరోహణావరోహణాలు సైరెన్ లాగ చేస్తాడు). నా గాత్రం కోకిల స్వరంలా లేదూ? లేదు అనేవాళ్ళు మనుషులే! (మళ్ళీ అందుకో పోతాడు)

మి—బతగడం కష్టం. మీరు మరి పాడకండి.

న—పాపం! అన్నీ తపురిష్టమే? వల్లకాదు. నా గానంయొక్క ఆనందం మీకు కలిగించక మానను.

మి—పోనీ, మానడానికి ఏ ముచ్చు గుంటారు?

న—క్రియముక్క చెప్పు నా సంగీతం బాగుందా లేదా?

మి—పడిసి మొహం కడుక్కున్నట్టుంది.

న—(కుడి ఎడటికి చూస్తూ) ఒరేయ్, కోదండం, ఇల్లారా!

కో—(కుడి ఎడటినించి వస్తాడు)

న—నువ్వా ఆవిడదగ్గిరికి నడు.

కో—(మిశ్చకోరం దగ్గిరికి నడుస్తాడు)

న—కొట్టడానికి సిద్ధంగా ఉండు.

కో—(బాదడానికి తయారవుతాడు.)

న—(ఆవిడతో) ఏం? నాగానం బాగుందా, లేదా?

మి—బాఘా ఉందండీ! ఊరికే నవ్వులాటలకి అంగాగ్రహించుకోలేరేం!

న—నవ్వులాటలకి వేళాపాళా ఉండద్దూ సే?

మి—ఉండాలిరా. లేకపోతే ఎల్లారా?

న—కోదండం! నన్ను ఇది ఒరే అనేస్తోంది. ఆడదైతే అయింది కాని, ఒళ్లుటిచ్చ్యనో, ఎంజేస్తాం! రాముడు తాటకిని కొట్టలేదూ?

కో—రావమ్మా తాటకీ! (అంటూ మిశ్చకోరాన్ని కొట్టబోతాడు.)

మి—ఆగాగు. మీ చేదువ్వసాములకి మెచ్చాను. మీ సంగీతానికి మెచ్చాను.

న—అదీమాట, ఆగరా. అలావెళ్ళు. (అని జేబు లోంచి పెన్సలూ కాగితమూ తీసి, గబగబా గీతలుగీసి) ఇట్లా చూడూ! ఈ చిత్రం ఏమిటి చెప్పూ.

మి—అచ్ఛంగా నా మొహంలాఉంది!

న—భేష్. ఇంక కవిత్వం వింటావా?

మి—చాలాసేపణ్ణించి వినిపిస్తున్నారుగా!

న—ఇది మరోరకం:

సరిగాని సానిగారి స

మారి ని గని మారి మారి మాని గనిరి మా

దరి గాద మాదగారిద.

దారి సని పదాప గాపదా పని సరిదా

ఇది సంగీత సాహిత్య సమ్మేళం. సంగీతం బోర్లిస్తే సాహిత్యం, సాహిత్యం తిరగేస్తే సంగీతం పుట్టాలి. ఈ రకం కవిత్వంలో, పాదాలు ముందుకీ వెనక్కీ ఒకే మోస్తరుగా నడుస్తాయి.

ఇలాంటి ప్రజ్ఞలు నీకిప్పుడున్న స్నేహితులదగ్గిర ఏడిశాయా?

మి—లేవు లేవు. అందులోనూ ఇంత తల్లకిందులు ప్రజ్ఞలు అసలు లేవు.

న—అటువంటప్పుడు ఆటంక మేముందీ?

మి—ఆటంకమా? నాకు మీరు నచ్చలేదు. పైగా ఎంతో ఏడిసినట్టున్నారు.

న—నేను చాలా అందగాణ్ణే, నీ దుంప తెగా!

మి—కావురా, నీ దుంప తెగా!

న—కోదండం, ఇల్లారా! ఏం? నేను అందగాణ్ణి కానూ?

మి—(కోదండాన్ని ఆగమని సంజ్ఞ చేసి)-(నవ్వుతూ) అప్పునండీ! మన్మథులు.

న—నేను శాస్త్ర చర్చలోకూడా ఎల్లాంటివాణ్ణను కున్నావ్! ఇక బలం! పెద్దపుల్ని తీసుకురా! ఒఖ్ఖ చెంప కాయ కొట్టి చంపేస్తాను. వెళ్ళు. తీసుకురా, నా మజా చూద్దుగాని. ముందు వెళ్ళి పెద్దపుల్ని తీసుగు రమ్మంటే చూస్తావేం అల్లా కళ్ళప్పగించీ!

మి—అయినా సరే నండీ! మీ అంత దిక్కుమాలి ఘటం ఎక్కడా ఉండడండీ. మీకంటె ఏ పీనుగైనా సరే నయం.

న—ఇదుగో మాటలు మర్యాదాగా, రాసీ. మరి ఆస్తిగురించి. నీకు ఆస్తిగోలే అఖ్ఖర్లేదుటగా. ఇదుగో పాతిగ రూపాయలు. పుచ్చుగో (అని, సిగ్గు అభినయిస్తాడు).

మి—పాతి గేమిటీ?

న—పాతిగ అంటే ఇరవై అయిదూ. సమావేశానికి ఆరేటు స్థిరపరిచావని తెలిసింది.

మి—నాసంగతి గ్రహించిన వార్ని ఇన్నాళ్ళకి మిమ్మల్ని చూశానండీ! ఎల్లా గ్రహించాడు తమరీ రహస్యం?

న—బోలెడుమంది చెప్పారు.

మి—(నవీను కుర్చీ వెనకాలకి వెళ్ళి నవీను కళ్ళు మూస్తూ) నేను మంచిదాన్నో చెడ్డదాన్నో చెప్పగోండి. కోదండం! ఇల్లా, రా. వచ్చి ఆనోట్లు తీసుగో.

కో—(సొమ్మ తీసుగుంటాడు)

న—ఏమి టదీ ? చెయ్యి వొదలవేం

మిం—నీకు రూపాయి లిచ్చింది, నేను, కోదండం ! తీసేసుగో. జాగర్త. ఈయన సంగతి కనుక్కో.

కో—(నవీనకుమార్ని కొడతాడు).

న—రూపాయలు తెచ్చినవాణ్ణి నేన్రా కుంకా ! నన్నే బాత్తున్నా వేం కర్మంరా ! (అని ఏడవబోతాడు)

కో—తెచ్చినోరు మీరై తేం, ఇచ్చినోరు ఆవిడయ్యా బాబూ ! తిను !

న—అల్లాయితే, బాదరా, బాదు.

కో—(ఇంకా గట్టిగా కొడుతూ) సరిపోయిందా ? ఇంకా కూంత టీం ఎక్కించనా ?

న—హోరి నిన్ను చంపెయ్యా ! సిగ్గుపడి మానావు గదా అని ఊరికే అల్లా అంటే, నాకిపారేశావురా, నీ చెయ్యి పడిపోనూ !

కో—నాతో మేలాకోలం ఏంటుకుమరీ, సచ్చేలా కొలం !

మిం—కోదండం ! ఆగు ! వీధులోకి వెళ్ళిపో ?

కో—(వంగి ఎదర్నించి వెళ్ళిపోతాడు.)

మిం—ఏయ్ ! నువ్వు నన్ను పెళ్ళాడ్తావా, ఆడవా ? పెళ్ళాడకపోతే అల్లరిచేసి, చావగొట్టించి, అవతలకి ఈడిపించేస్తాను.

న—పెళ్ళాడ్తాను. బ్రహ్మాండమూ ఏమిటి? పెళ్ళంటే నాకేమన్నా భయమని చూస్తున్నావా, వెధవ పెళ్ళి నువ్వూనూ!

మి—అల్లాయితే ఆ సంగతి కాగితంమీద రాసి సంతకంచేసి యియ్యి! (అని, కలం కాయితం యిస్తుంది.)

న—(తనలో) ఎలాపడితే అలా అర్థం వచ్చేలాగు రాయలేననే గాపును ఈ పీనుగు ఉద్దేశం! ఇల్లాంటి ఝూటా రకాల్ని అనేకమందిని చూశాను. ప్రస్తుతం మట్టుకు నా కర్మం ఇలా కాలింది.

మి—సందేహిస్తే నాకఖ్ఖర్లేదు.

న—సందేహం లేదు. (అని రాయడం అభినయించి, రాతకేసి చూస్తూ) "శ్రీశ్రీ మిశ్చకోరం గారికి—మీరు పెళ్ళి చేసుగోవలిసిందిగా నన్ను అడిగారు. నాకు అభ్యంతరం లేదు. పురోహితుణ్ణి కేకెయ్యండి. మీరు నాసంగతి రొష్టు చెయ్యకుండా, నన్ను చావగొట్టకుండా ఉండేషరతు. ఇది నాసమ్మతిని రాసిచ్చిన పెళ్ళి ఖరారుచీటీ—ఇట్లు, బస్తీ కాపరస్తుడు, యన్. కె. మూన్.

మి—ఒకేఃయ్, కోదండం!

కో—ఏటమ్మా.

మి—దీనిమీద సాక్షి సంతకం చెయ్యి.

కో—అంటే ఏటి?

మి—పోనీ, ఇల్లాతే సిచెయ్యి.

కో—ఇదుగో! సెయ్యి నొక్కేస్తారా?

మి—(కోదండం ఎడమబొటనవేలుకి సిరా రాసి చీటీమీద వేలు ముద్ర వెయిస్తుంది.) సరే, నువ్వెళ్ళు.

కో—(కుడి ఎదరకి పోతాడు.)

మి—(నవీన్‌తో) వీధులోంచి వచ్చి, ఇంకా ఇంట్లో కెళ్ళి వేషానికం తీసెయ్యకుండానే తమరు పెళ్ళిమాటల్లో పడగొట్టేశారు. నేను లోపలి కెళ్ళి డ్రెస్సు విప్పేసి వస్తాను దయచెయ్యండి. (అని లోపలికి-ఎడమకి-వెళ్ళబోతూ ఆగి) పోనీలెండి మళ్ళీ లోపలి కెడితే ఆలస్యం అవుతోంది.

న—చచ్చాన్రా బాబూ! ఈ ముండ బొత్తిగా సిగ్గెరగదు. సిగ్గుకి వర్ణక్రమంకూడా దీనికి తెలియదు. డ్రస్సు ఇక్కడే తీసేస్తుందేమోగదా, ఏమిటి సాధనం!

మి—(నడుంకి పెట్టిన పట్కా తీసేస్తుంది. నడుం వంగిపోతుంది)

న—(నిర్ఘాంతపోయి) ఓరి దీనితగెలెయ్యా! అచ్చంగా కొంగ నడుమే!

మి—విగ్గు తీసేస్తుంది. బోడిగుండు కనిపిస్తుంది)

న—(నెత్తి బాదుకుంటూ) అయ్యో నాకర్మమా! నా ప్రాలుద్ధమా! ఎంత పాపినిరా! ఓసి బోడిముండో వ్! అదేమి జుట్టే నీజుట్టు మండో వ్? ఎంత దగా చేశావే చలిమిడి ముద్దా!

మి—(నవీను కేసి చూసి వేళ్ళు ముద్దెట్టు గుంటుంది.

న—ఓసి నీముద్దు ముక్కలైరిగదే! నీముద్దు ముక్కలవా!

మి—(రెండుపళ్ళు లాగేసి దూరంగా పెడుతుంది)

న—(ఏడుస్తూ) ఈ పాపం నేను ఏజన్మలో చేసుగున్న బాపతో! బోసినోరుగుడాను. దీనినోరు నాకా! కడంపల్లూ కట్టుపళ్ళే గావును! ఓరి దీనిమాయ మండా! నోరు లక్కపిడత గావును! ఎంత పడుచువేషం వేసిందీ! ఎంత వ్యామోహంలో పడ్డాను! నువ్వు నా పెళ్ళాం ఏమిటే బోసిపుకి! కొంగనక్కా! బోడి బొప్పాయీ! కాలశనీ!

మి—(తక్కుతూ, తలతిప్పుగుంటూ, చూపులు విసురుతూ) నాథా?

న—(పక్కకి తిరిగి) చెప్పుదెబ్బలు తగిలేదాకాను! నాథాట! అనాథకట్టె?

మి—తాళజాల, తాళజాల! నాథా, ఎటులోర్చుకుందు నీ బాధా!

న—విసినికర్ర పుచ్చుగుని గాడిదయ్యలోకరాల్చే!—వెధవ చక్కిలం!

మి—ముగుడుగారూ! మీరూరుకుంటే నేను ఊరెట్టుగుంటాను.

న—ఫస్టుక్లాసుతాడు సప్లైచేస్తాను తాసీ!

మి—మీరు పెళ్ళి...

న—హవ్వ! (అని నోరు నొక్కుగుని, దణ్ణం పెట్టి) ఒసేవ్! ఓ బ్రామ్మాన్! చూడు, నీకు చాలా పుణ్యం ఉంటుంది గాని, పెళ్ళి అనేమాట మాత్రం అనకు! తల్లీ రక్షించు! అమ్మా దణ్ణం!

మి—మదనా నాపై నింత చలమా! (పాడుతుంది)

న—నీ విరహం అంటించిరిగదే! (అని దుఃఖిస్తాడు) తను కథానాయిక ననిగావును ఈ జంబుకం ఉద్దేశం!

మి—హా ప్రియా! నినుబాసితే నే ప్రకారము సైతురా! (అంటూ పాడుతుంది.)

న—నువ్వు పాటకుడా మొదలెట్టకే (అని కసిస్తూ) నా జన్మాంతరం!

మి—ముద్దుపెట్టరా, నారాజా!

న—కోదండం! దగాపడ్డాన్రోయ్!

కో—(వచ్చి కొడుతూ) ఎందుకు దగాపడ్డావ్?

న—ఇక పడన్రా! నిన్ను తెగ్గొయ్యా! మొదట్లో ఊరికే అల్లా ఏమిటో అనుకున్నాన్రా!

కో—(మళ్ళీ కొడుతూ) ఎందుకు అనుకుంటావ్?

న—ఇక అనుకోన్రా, నీమొహం క్షౌరం చెయ్యా, ఊరుకోరా!...ఇందాకా ఇది నన్ను 'ఒరే, ఒరే' అని ప్రారంభించింది. ఇదేమిరా దేవుడా, ఇది నాకంటె పెద్ద పీనుగు కాదుగదా! అనిపించింది. కాని (అని ముఖం ఆపు గుంటూ) అప్పుడేనా ఇది ఇంత ముసిలివరుగనీ తోచలేదు,

ఇంత బోడితలనీ తెలియలేదు! బ్రహ్మకేనా కర్మతప్పదు, నాకూ తప్పలేదు.

మి—(బోసి నటించి) రాసిచ్చినప్రకారం పెళ్ళి చేసుగోపోతే కోర్టులోకి ఈడిపిస్తా, జాగ్రత్త!

న—ఓసి తాతమ్మా, ఏమని రాసిచ్చానో! (అని బోసిగా వెక్కిరిస్తాడు.)

మి—నన్ను పెళ్ళిచేసుగుంటానని!

న—ఒక్కనాటికి అల్లా రాసివ్వలేదు. కావలిస్తే తెగేసి చదివి అర్థం చెబుతాను. ఆ కాకితం ఇల్లా పట్రా. పోనీ నాచేత కాకపోతే అదేపోయిరి, అథమం మనిషైన వాడిచేత ఎవడిచేతేనా చదివించిచూడు. బుద్ధున్న వాళ్ళెవళ్ళూకుడా నీకుమల్లే అర్థాలు లాగరు. మరే! అర్థాలూ లాగరు, ప్రాణాలూ లాగరు.

—నీతో పెళ్ళినీ ఊరేగడమూనా? హావ్వ హావ్వ (అని నోరు నొక్కుగుంటాడు)

మి—అబద్ధాలాడకు. (అని కాగితం చూపిస్తూ) ఇప్పుడు ఆదేరాసింది!

న—చస్తేలేదు. ఎంచేతంటే "పెళ్ళి చేసుగోవలిసిందిగా నన్ను కోరావు" అని రాసిచ్చానుగాని, ఎవర్ననో ఉందులో లేదు. పైగా శాశ్వతపు అనగా యావజ్జీవపు పెళ్ళి అనికూడా నా ఖరారులో లేదు. నాఉద్దేశం ఏమిటంటే పెనాన్ని వీలైనవారిని అనిన్నీ, తాత్కాలికంగా అనిన్నీ.

మి—నువ్వు ఉద్దేశాలు మార్చుగున్నావా లేదా?

న—లేదు.

మి—కోదండం ఇల్లారా! (అని, ఆగి, పక్కకితిరిగి నిదానించి కోదండం కేసి చూసి) పోన్లే వద్దు, ఆగు.

కో—(కుడి ఎదర ఉంటాడు) \

మి—(నవీనుతో) ఏమోయ్, కుర్రజ్వాయి! పోనీ, నీ అర్ధమే ఖాయం. నన్ను మినహాయించి ఎవర్నో ఒకర్ని యావజ్జీవ వివాహం కాకుండా క్షణిక వివాహం చేసుగునే టందుకు ఒప్పుగున్నావ్ అన్నమాట! సరే. నా స్నేహితు రాలు మిస్ కోకిల ఒక ఆవిడ ఉంది. ఆవిణ్ణి పిలిపిస్తాను.

న—మీ యిద్దరికీ బంధుత్వం ఏమీ తగులడ లేదు కద?

మి—ఏం?

న—ఏం ఏమిటీ! మూడుమూర్తులా మళ్ళీ నీకు మల్లేనే అదికుడా నున్నప్పిడతలా తయారై ఉందేమో, ఛస్తాం,—అని.

మి—ఆవిడ నాకు ఒక స్నేహితురాలు. ఆవిడ ఎల్లాంటిదైనా సరే నువ్వు చూడవలిసిన అవసరం లేకుం డానే నువ్వు క్షణిక వివాహానికి ఒప్పేసుగోవాలి. లేకపోతే ముందు నిన్ను చితక్కొట్టించి, అనంతరం కేసు చెయించి, తరవాత ఆపరేషన్ చెయిస్తా!

న—హాసి నీ ఊహలు అంటించా! ఒప్పాగుం టానే! అయ్యో! అదెల్లా ఉంటుందోగదా! (తనలో) ఏంజేస్తాం! లేకపోతే పాతిగరూపాయలూ గుప్పుడండగ.

మి—సరే. (అని కాగితం కలం తీసి చీటీరాసి కోదండంచేతి కిచ్చి) ఒరేయ్! ఇది తీసికెళ్ళి పెద్దబజారు పక్కసందులో నూందగ్గిర ఎడంచేతివేపు ఐదో యింట్లో ఇయ్యి. ఒకవేళ ఆవిడ ఇంట్లో లేకపోతే నువ్వు ఆగి, ఆవిడ వచ్చిం తరవాత ఇది యిచ్చి, ఆవిణ్ణి తెల్లవారకుండా ఇక్కడ హాజరు పెట్టు.

కో—సిత్తం. (అని కుడి ఎడరకి పోబోతూఉంటాడు).

మి—ఒరేయ్, చూడూ! ముందు ఈ అబ్బాయికి సంకెళ్ళు వెయ్యి. (అని ఎడమ మధ్యకి వెళ్ళి ఇనపగొలుసులు తెస్తుంది).

కో—(నవీనుకి సంకెళ్ళు వేస్తాడు).

మి—ఒక మంచి పురోహితుణ్ణికూడా కేకేసుగురా. వాడు ఇంగ్లీషులోకూడా పెళ్ళి చేయించేవాడైతే నయం. ఎంత త్వరల్లో పడితే అంత త్వరలో పెళ్ళి అయిందీ అని పించేవాడు కావాలి. వాడికి బాగా ఇస్తాను.

కో—నాకు బాగా ఇద్దురూ! ఆడికి నేను బాగా ముట్టసెబుతానూ!

మి—ఓ అబ్బాయి! నువ్వు (ఎడమ ఎదర చూపిం చుతూ) ఆ పెద్దగదిలో కూచో. నిద్దరొస్తే పడుకో. వెళ్ళి తెల్లారగట్ట. నేను ఈ హాలుకి తాళంవేసి వెళ్ళాలి.

న—హాలుకన్న మూతేమిటీ, నువ్వు అన్నింటికీ తాళంవేస్తావు. సరేనే, బామ్మా, సరే. ఇన్ని మంచినీళ్ళు ఇక్కడ తగలేసి మరీపడు!

మి—ఆదండం! మంచినీళ్ళూ అవీ ఈయన కిచ్చి మరీవెళ్ళు.

కో—(ఎడమ ఎదరకి నడుస్తూ) రావయ్యా.

(నవీను వాడి వెనకాలే వెడుతూండగా, తెర.).

---

## రంగం-5

[మిశ్చకోరం ఇంట్లో పెద్దగది. కుడిపక్క మూలగా చాపమీద ముసుగెట్టుగుని, నవీను, నిద్రపోతూ ఉంటాడు. రంగంమధ్య పెళ్ళిపీటా, దానిమీద కొత్త అంగాస్త్రం. పక్కని పువ్వులూ తలంబ్రాలు మొదలైన సరంజామూ ఉంటాయి.]

మి—కుడి ఎదరనించి కర్రమీద ఆనుకుని వస్తా) ఏమయ్యోయ్! పెళ్ళికొడకా! ఓమూల సుముహూర్తం వచ్చిపడుతూంటే, నువ్వింకా నిద్దట్లోనే ఉన్నావే! బాగానే ఉంది. ఒఖరవ్వ మేలుకొలుపులు పాడుదునా!

పెళ్ళికొడకా మేలుకోవోయ్
పెళ్ళికూతు ర్నేలుకోవోయ్
తెల్లవారెను తూర్పుదిశ, నీ
తెలివి మళ్లేనే!
పెళ్ళికొడుకూ పెళ్ళికూతురు
కళ్ళపడలే దొకళ్ళకొకరు
చూడకుండా ఒప్పుగోడం
చోద్యం అదృష్టం!
శుభముహూర్తం దివ్యయోగం
ఉభయతారకమైన విషయం

చౌక బేరం ఫలం అధికం
క్షణిక వ్యాపారం!

(అని పాడి, దగ్గిరకెళ్ళి పెద్దచప్పట్లు కొడుతుంది.)

న—(ఉలిక్కిపడి లేచి) ఆఁ (అని కళ్ళు నులుము కుంటూ) ఓసి శనీ! నిద్దర తగలేశావే. నీతాడు తెగా!

(దీనంగా) ఓ మొత్తెడు చెంపకాయైతే కొట్టి పళ్ళు రాలుద్దాం అంటే చాలా పళ్ళు దీనికి లేనేలేవాయిరి. పోనీ, నడ్డి విరక్కొడదాం అంటే నడ్డి పడేఉంది. ఆఁఆఁ (అని ఏదో తట్టినట్టు నటించి) అవ్వోయ్! నువ్వు మరి అల్లరి చేస్తివట్టాయినా, కాలు విరక్కొడతాను. దాంతో కూచుం టావు ఓమూల.

మి—వెనక ఓమాటు నే పడ్డప్పుడు కాలు విరగనే విరిగింది. విరిగినకాలు విరక్కొట్టడానికి తగ్గ వీరుడవే, నాయినా! అయినా, నేనేంజేశాననీ! పెళ్ళిఅని చెప్పినా తప్పే?

న—ఈ పీటా అవీ ఏమిటె నీ బొందా!

మి—పెళ్ళిపీట అబ్బాయి! అల్లా ఊహూ చెండ్రు కుంటావేం?

న—వివాహం గాంధర్వంకాదూ! అటువంటిదానికి ఇవన్నీ ఎందుకూ?

మి—ఎందు కేమిటే! ఎవళ్ళ ముచ్చట్లు వాళ్ళవి! ఇదో తంతూ! నువ్వు ఇంచక్కా బుగ్గని చుక్కా అవీ పెట్టుగోవూ?

న—నువ్వు నీ జోడీగుండు నిండా నున్నబొట్లెట్లు పెట్టుగోవే, గొబ్బెపువ్వా !

మి—కళ్ళకి కాటిగా వద్దూ ?

న—నీ కళ్ళకి సుర్మా పెట్టుగో ! కాటిగట. 'ఓ పూట పెళ్ళికి మొహం అంతా కాటిగే' అని శాస్త్రం చెబుతాన్నే. అల్లా ఉం డిడి.

మి—కాళ్ళకి పసుపో ?

న—నీ నోరు లక్కపిడతలా నొక్కెయ్యనా ఊరు కుంటావా ? కోపంవస్తే చంపెయ్యగల్ను. ఊరుక్కో నులక మంచం కుక్కకానా !

మి—చంపూ, చంపరా ! చూస్తానూ, ఏమాత్రం చంపుతావో ! తలుపులన్నీ పైన తాళాలువేసి ఉన్నాయి. నిన్ను పట్టుగుని ఉరితీసేస్తారు, నన్ను చంపితే !

న—ఏడిశావులేస్తూ, ఆ భయం నాకు లేనేలేదు. ఇరవై అయిదు రూపాయలూ బిళ్ళగోడుముల్లాంటివి నీ మొదాన్ని పోస్తినిగదా అని బాధపడుతున్నాను.

మి—పోనీ, కాస్తంత ముస్తాబు చేసుగో, రాజా !

న—అద్దం దువ్వెన్నా పట్టుగొచ్చి, ఓ కోటూ తల గుడ్డా పట్రా. సెంటు ఉంటే, తే.

మి—(కుడి మధ్యకి వెళ్ళి అద్దం దువ్వెన్నా కోటూ తలగుడ్డా సెంటూ తెచ్చి నవీను దగ్గిర పెడుతుంది)

న—(కోటు తొడుక్కుని, క్రాపింగు దువ్వుకుని, తలపాగా చుట్టుగుని, ఠీవిగా నడుస్తూ కోరగాచూస్తూ,

మీాసం దువ్వుతూ చిరినవ్వు నవ్వుతూ) ఏమే అవ్వా! నే నెల్లా ఉన్నా!

మి—నా కుచ్చుల రంగడులా ఉన్నావు!

కో—(ఎడం ఎదర లోపల్నించి) 'ఏమండోయ్, సెకోరంగారు.'

మి—వస్తున్నా. (అని కుడి మధ్యకి వెళ్ళి ఒక నల్లటి ముసుగు గుడ్డ తెచ్చి నవీను కిచ్చి) నే చెప్పేదాకా ఈ ముసు గేసుగుని కూాకో్చ! లేకపోతే నీకుదిష్టి కొడుతుంది.

న—(నల్లముసుగు కప్పాగుని, కుడివేపు తిరిగి, కుడి ఎదట కూర్చుంటాడు.)

మి—(ఎడమ ఎదరకి నడుస్తూ) ఇల్లారా!

కో—(ఎడమ ఎదర్నించి వస్తూ) ఆ కోకిలమ్మగారు గోసాగా బండిలో ఒత్తదంట. ముందెల్లి నన్నీ సీటీ నీకిమ్మంది. (అని ఒక చీటీ తీసి మిశ్చకోరానికి ఇస్తాడు.)

మి—(చీటీ అందుకుని) సరే. నువ్వెళ్ళు. వాకిట్లో భజంత్రీలున్నారు. వాళ్ళతో మేళం చెయ్యమని చెప్పు.

కో—ఓడికి పట్టిందమ్మా! నాకు దాఘుమేస్తుంది.

మి—(ఎడంచేత్తో రివాల్వరు చూపెట్టి) వెళ్ళు.విను.

కో—సిత్తం సిత్తం. (అని భయపడి ఎడమ ఎదరకి పోతాడు.)

న—ఒసేయ్! బామ్మా! అబాజాలు మాని పివాస్తా, నిన్ను అయిన కాడికి చంపమన్నావా?

మి—(కుడివేపు తిరిగి, రివాల్వరు చూపిస్తూ) నువ్వెళ్ళి హాల్లో కూచో. వేళకి నేవచ్చి తీసుకొస్తాను!

న—సరేనే, సీ పిలాపస ముండా! ఏం కర్మం వచ్చిందే నాకూ! (అని, కుడి ఎదరకి వెళ్ళిపోతాడు.)

మి—(ఉత్తరం చెప్పిచూస్తూ) "నా పుట్టుసుక్కుల్లో హాపవైభవాలూ చూసకుండానే, మీమాట బలంచూపాన, నన్ను యస్. కె. మార్ గారు స్వీకరిస్తారన్నారు గనక, వారికి చాలా విధేయురాల్ని. కందనమాటు నాకు ఓ పరాభవం అయి జ్ఞానోదయం అయిందిగనక, నేను ఘోషాలో వస్తున్నాను. ముందు పెళ్ళికొడుక్కి నాకూ ముఖపరిచయం అయింతరవాతే, సుముహూర్తం వచ్చేటట్టు ఏర్పాటు చెయ్యండి. నేను తరించి మరొకర్ని తరింపజేసే తరుణం మీరు నాకు ప్రసాదించినందుకు మీకు అనేక ధన్యవాదాలు. ఇట్లు మిస్ కోకిల."

(కుడి ఎదరకి వెళ్ళి) ఏయ్! యస్. కె. మూర్!

న—(కుడి ఎదర్నించి వస్తూ) ఏం?

మి—ఆవిడ వచ్చేవేళ అయింది. నువ్వు సిద్ధంగా ఉండు. ముందు ఆవిణ్ణిచూసి ఆవిడతో శాస్త్ర భాత్యాన్నీ పెయ్యి. తరవాతలే, సుముహూర్తం. ఇంతలో పురోహితుడూ సాక్షులూ వస్తారు.

న—సరే లేస్తూ, బోడిసోది! పెళ్ళికూతుర్నిరమ్మందూ నువ్వు త్వరగా అవతలికి విరగడైపోయ్! శనేనా వదుల్తుంది గాని, నువ్వు ఓపట్టాన్న వదిలేటట్టు కనిపించవే!

మి—ఉండు నాయినా, వెడతానూ! తొందరపడకుమరీ!

న—(కుడి ఎదర కుడివేపు తిరిగి కూచుంటాడు)

మి—(ఎడమ ఎదరనించి నిమ్మళంగా లోపలికి వెళ్ళి, రెండు కుర్చీలు లాగి కొంత ఎడంగా రంగంమీద వేసి, మళ్ళీ వెళ్ళి, ఎడమకుర్చీ చాకా ఎడమ పక్కనించి తెర పట్టుగుని ఎవరొచ్చి కూచున్నారో తెలియకుండా మనసా దేవిని నఖశిఖ పర్యంతమూ నల్లముసుగులో తెచ్చి ఎడమ కుర్చీమీద కూచోపెట్టి, తెర వదిలేసి, నవీను దగ్గిర కెళ్ళి అతణ్ణి జబ్బపట్టుగుని లేవదీసి, కుడివేపుకుర్చీలో కూచోపెట్టి, తాను కుర్చీలమధ్య నిలబడి)

—నేను ఇక్కడుంటే మాట్లాడుకోడానికి మీరు సిగ్గు పడొచ్చు. అందుకని నేను లోపలికి పోతాను. కాని, నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్న లడుగుతాను, సంజ్ఞలు చెయ్యండి.

ఈ పెళ్ళికి మిమ్మల్ని ఎవరూ బలవంతం చెయ్యలేదుకద!

ముసుగులు—(లేదు అన్నట్టు తలలు తిప్పుతారు)

మి—ఈ పెళ్ళి మీ బుద్ధిపూర్వకమేనా ?

ముసుగులు—(అవును అన్నట్టు తలలు తిప్పుతారు).

మి—ఈ పెళ్ళి మీకు నష్టదాయకం కాదుగద !

ముసుగులు—(కాదు అన్నట్టు తలలు తిప్పుతారు).

మి—ఈ పెళ్ళి మీకు లాభకరమే గద !

ముసుగులు—(అవును అన్నట్టు తలలు తిప్పుతారు).

మి—ఈ పెళ్ళి ఎల్లకాలపు పెళ్ళి కాదు.కాదూ!

ముసుగులు—(కాదు అన్నట్టు తలలు తిప్పుతారు.)

మి—ఈ పెళ్ళి తాత్కాలికం కాదూ?

ముసుగులు—(అవును అన్నట్టు తలలుతిప్పుతారు.)

మి—సరి. మీరు ముందు కొంచెం ముఖపరిచయం, తరవాత కొంచెం మాటస్నేహం చేసుకుంటూ ఉండండి. తదుపరి సుముహూర్తం. నేను లోపలికెళ్ళి తక్కిన ఏర్పాట్లు చూసివస్తాను. మెల్లిగా బాజాలు వాయించమంటాను. ఇక మీరు ముసుగులు తీసేసుగోవచ్చు.

(అని, కుడి వెనకకి నిష్క్రమిస్తుంది.)

[నింపాదిగా చౌకంగా వాయింపు జరుగుతూండగా, ముసుగులు అల్లానే ఉంచుగుని, నవీను తన ముఖం కుడివేపు నించి సభవారిమీదుగా ఎడమకిన్నీ, మహాదేవి తన ముఖం ఎడమవేపునించి సభవారిమీదుగా కుడికిన్నీ మెల్లిమెల్లిగా తిప్పినమీదట ముఖాలు రెండూ ఎట్టఎదురు కాగానే, నవీను తన ముఖంమీది ముసుగుమీద ఎడంచెయ్యీ, పెళ్ళికూతురు ముఖంమీది ముసుగుమీద కుడిచెయ్యీ ఉంచి, ముసుగులు పట్టుగుని, 'వన్ టూ త్రీ, ఒకటి రెండు మూడు, ఏక్ దో తీన్, సైఁ ప్రాప్తం చెప్పలేం!, అని ఒకేసారి తీసేస్తాడు. అతడు మహాదేవి ముఖం చూడగానే అతడి ముఖతేజం పోతుంది. అతడికళ్ళు పెద్దవైపోయి గుడ్లు తిరిగిపోతాయి. కిందిదవడ జారి నోరు తెరుచుగుపోతుంది. నాలిక వెళ్ళబెట్టి అతడు కుర్చీలో వెనక్కి వాలిపోతాడు. మహాదేవి తొణక్కుండా నిబ్బరంగా ఉండి, ముక్కుమీద వేలువేసుగుని, అతణ్ణి పట్టుగుని ఉపచారం చెయ్యబోతూండగా; తెర.]

---



భమిడిపాటి కామేశ్వరరావు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య - ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు - కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం), 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తికలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ, రాయలసీమలోనూ, నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.